Regd No. M- 3289 ... అణా Regd No. N- 45

# గోలకొండపత్రిక

ప్రతి సోమ, గురువారములందు ప్రకటింపబడును

సం॥ చందా రూ. ౬ 10.2.155 జులై ౧౯వ తేది ౧౯౩౭ సోమవారము అర్థ సం॥ చందా ౩

ట్రూపుబజారు హైద్రాబాదు - దక్కన్

సంపుటము ౧౨ శా. శ. ౧౮౫౯ == శ్రీ ఈశ్వర సం॥ ఆషాఢ శు॥ ౧౧ సోమవారము == ౧౩ మహా రేవరు ౧౩౪౬ ఫ. సంచిక ౨౧

## సంఘము: యువకుల కర్తవ్యము

స్వాతంత్ర్యము, సమాన ప్రతిపత్తి, విశ్వమానవ సోదరత్వము జాత్యభివృద్ధికి మూలమంత్రము

సమానప్రతిపత్తికి వర్ణాశ్రమము లాటంకములు

ప్రాచీనాచారములు పనికిరావని గ్రహించినపుడే మనకు మోక్షము

"లేదను" శబ్దము దేశమునుండి నిర్మూలమొనర్చుటకు కంకణబద్ధులు కావలయును

భాషాభివృద్ధికై కృషిసలుపుటయే ప్రస్తుత కర్తవ్యము

(ఖండవల్లి లక్ష్మీరంజనంగారు ఎం. ఏ)

భారతభారతముయొక్క భారము యువకులపైనున్నది. ఇది ఉపచారవాక్యము గాదు. దేశము దినదినము క్రొత్తమార్పుల కుగురియగుచున్నది. నిన్నటిపరిస్థితులు నేడు లేవు నేటిఆదర్శములు, ఆశయములు రేపు మారిపోవును. నిన్న సత్యమనితలంచిన విషయము నేడు పూర్ణసత్యముగ తోచుటలేదు. నేడు ఇదియే సిద్ధాంతమని మనమందరము నమ్మినయంశములు కొలదికాలములో మారిపోయి మనసిద్ధాంతములు అపభ్రంశములుగా ముందువారికి తోచవచ్చును. ఈప్రబలమైనమార్పును మనము జీవితమందలి ప్రతి రాజమార్గమందును జూచుచున్నాము. మనము జప్తియందుంచుకొనవలసిన యంశము మరొకటి కలదు, అదిమన సమస్యలు. ఈరాష్ట్రమందలి పరిస్థితుల ననుకూలముగ బరిష్కరించుకొనదగినవి యైనను మనసమీప ప్రపంచమందు ఎట్టిమార్పులు జరుగుచున్నవో చూచుకొనుచునే మనము వ్యవహరించవలెను. ఇతరభాగములందలి పరివర్తనములు మనతో సంబంధించక, ఆప్రాంతములవారు వారిదారిని, మనము మనదారిని, ఎవరికివారే యమునాతీరే అని తలంచుట పొరపాటు. అట్లుచూడక తలవంచి చక్కనిదారిని పోవుచున్నామని తలచువాడు వరద ముంచుకొనివచ్చుచుండ తలుపు మూసికొని క్షేమము గానున్నానని తలంచువానివలె కష్టములకు గురియగును. అర్థశతాబ్ది క్రిందట మనసంఘము ఇట్టి సంకుచితత్వమునుండి క్రమముగా మేల్కొనుచున్నది.

### జన్మసత్వముల లోపములు

ప్రపంచము రాజకీయముగను, ఆర్థికముగను, సాంఘికముగను పెద్దపెద్ద అంగలతో నడచుచున్నప్పుడు మనము అంధభూతులమై పెండ్లినడకలు నడచుచుంటిమి. ౧౮వ శతాబ్దము ప్రపంచచరిత్రయందు చిరస్మరణీయమై నిలువగలదు. ఆధునిక నాగరకతకు నాడే పునాదులు వేయబడెను. నాడు భావప్రపంచమునందు గొప్ప విప్లవము జరిగెను. దానిని రాజకీయ సాంఘిక రంగములందు ప్రవేశపెట్టినవారు ఫ్రెంచివారు, మానవులకెల్ల స్వాతంత్ర్యము, సమానప్రతిపత్తి, మానవసోదరత్వము అను త్రిపిటకములను పైరగాలికి బూరుగుదూదివలె వెదజల్లివేసిరి. పాశ్చాత్యప్రపంచమునందీమూడును అకాలములో ద్వాదశవర్షక్షామమునందు పచ్చనిపైరువలె కంచుకాగడాలతో వెదకినను దొరుకకుండెను. ఒక్క అంగ్లదేశమునందుమాత్రము అంగ్లేయుల ధీరకౌశల్యఫలితముగ స్వాతంత్ర్యమునను కొంతవరకు వ్యక్తికిలభించెను. వాక్స్వాతంత్ర్యము, పత్రికాస్వాతంత్ర్యము, బహిరంగముగ సభలుచేసి తమయభిప్రాయముల ప్రకటించు స్వాతంత్ర్యము, తమతమ మతానుసారముగ ప్రార్థనాదుల సలుపుకొను స్వాతంత్ర్యము అంగ్లేయులలోకూడ ౧౯వ శతాబ్దమువరకు లేకుండెను. ఉదాహరణముగ రోమన్ కాథలిక్కుల విమోచనము ౧౯వ శతాబ్దారంభమందుమాత్రము అంగీకరింపబడుట చరిత్ర చదువువారికి పరిచయము, మానవుల సమాన ప్రతిపత్తి [Equality] నామకః యంగీకరింపబడెను: మానవ సౌభ్రాతృత్వము భావవీధియందే నేటికిని విలీనమైయున్నది.

### సమానప్రతిపత్తి

పాశ్చాత్యులతో గల్గినసంబంధమువలన నీ భావవిప్లవము మనదేశమందును నడుగులు గ్రక్కుచువచ్చి పడుచున్నది. ప్రపంచమంతయు ప్రజాశక్తియే ప్రభుశక్తి, ప్రజలే ప్రభువు, ప్రభువు ప్రజలకంటె యన్యముగాదని ఘోషించు దినములలో మనము "నావిష్ణుః పృథివీపతిః" యని గొణుగుకొనుచుంటిమి. మానవులందరికి సంఘమునందు సమానప్రతిపత్తి యుండవలెనని వారు వాదించుచుండ మనము వర్ణాశ్రమముల తోడుగులొక్కని నీవుచిన్న, నేనుపెద్ద; నీవు తక్కువ నేనుఎక్కువ—అని వాగ్వాదము చేయుచుంటిమి. ఆధ్యాత్మికముగ మానవాత్మలన్నియు ఒక్కటేయని అనాదిగ మనము నమ్మితిమి. సాంఘికముగ వర్ణములనదమము, ఉత్తమాదమ వ్యవస్థలనంగీకరించుట కడువిచిత్రము—ఇదేపాశ్చాత్యులలో తలక్రిందుగనున్నది—రోమన్ కాథలిక్కులకు ముక్తియున్నదని ప్రొటెస్టెంటు నమ్మడువాడుగాడు—ప్రొటెస్టెంటు నరకద్వారముదాటి ఒక్క అడుగుపెట్టజాలరని కాథలిక్కులు నమ్మరేవారు—అయినను వారి సాంఘికవ్యవస్థలో ఎక్కడను విశమత్వముండుటకు కారణము వారు సమానప్రతిపత్తిసూత్రమును నంగీకరించుటయే—పాశ్చాత్యులలో మానవ సౌభ్రాతృత్వము ఎంతవరకువ్యాపించినది అబిస్సీనియాపైనిటలీవారిదౌర్జన్యములు నేడుస్పెయినులోజరుగుఅన్యోన్య హత్యాకాండములే తార్కాణము—కానిఆనాదినుండి మనకు "లోకాఃసమస్తాఃసుఖినోభవంతు" "స్వస్తిప్రజాభ్యః" అనియు ఘోషించుచున్నాము—తదనుగుణముగనే భావించుచున్నాము—అయినను మన సంఘమునందేల ఇట్టిగగ్గోలుపుట్టుచున్నది—ఒకని చేతియుద్దను దాయణారీతిగానైన హరింపవలెనని మనము తలంపమే—పాశ్చాత్యులవలెఎక్కడ పచ్చనినేలఉంటే అక్కడవ్రాలి దానినంతను మనమేకావులోవలెనని ఏడువమే—ఐనను ఏలమన కీదౌర్గత్యము, ఆలోచించిచూడ మనలో సమానప్రతిపత్తిసూత్రము అంగీకరింపబడకపోవుటయేఅని తోచుచున్నది—"విద్యావినయసంపన్నే బ్రాహ్మణేగవిహస్తిని, శునిచైవశ్వపాకేచ పండితాః సమదర్శినః" అని ఆత్మయొక్క సమానప్రతిపత్తిని అంగీకరించిన మనము, నశ్వరమైనశరీరమునకు సమానధర్మిత్వము అంగీకరింపబడకుండుట చాల శోచనీయము—పంచమసోదరులకు ఉన్న హానిలో సగము పెట్టుచున్నాము—"మనపొలములందు పనిచేస్తారు—ఇండ్లలోపని చేస్తారు—వారు నాలుగు డబ్బులు సంపాదించుకుంటే మనము సంతోషిస్తాము కాని అసూయపడము—అయినను వారిని దరికి రానీయము" మన యహితులు, రంధ్రాన్వేషపరులైనవిందు, మనలోపములను గోరంతలు కొండంతలుగా చేసి, పెంచి లాభమునొందదలచుకొన్నవారు ఇదేసమయమని తొందరపడుచున్నారు—ఎదురుపడని పుండుఏర్పడినది_ పొడుచుకొనితిను కాకులకు ఇంతకన్న మంచితరుణము దొరకజాలదు—ఆధ్యాత్మికముగ సమానత్వమునంగీకరించినమనము, ఆర్థికముగ హరిజనులకు ఎట్టియుద్ధంపులుగల్గించని మనము; వారికిని సాంఘికముగ సమానప్రతిపత్తిని గల్గించుటలో అభ్యంతరమేమో గోచరించుటలేదు—మనసంఘములో నీలోటు ఉండుటవలనగల్గు గొప్ప హాని అనర్థదాయకము—అనాతురత

ఆర్థికముగ ప్రపంచజాతులనడచిన క్రొత్త ఒరవడి—భారత దేశమునందు వినము నడచిన క్రొత్తమార్పొక్కటి—౧౮వశతాబ్దములోనే ఆ క్రొత్త గుర్తించి వస్తునిర్మాణమును విపరీతముగ పెంచిపాశ్చాత్యులు తమపరిశ్రమలచే జగమును నింపివైచిరి—వ్యవసాయమునుగూడ ఆధునికపద్ధతులపై నడిపించి ఎకరమునకు పుట్టెడు పండేచోట పదిరెట్లెక్కువ పండించుచున్నారు—ఈ సరక్షేత్రములనుగూడ విడువక "పృథు" చక్రవర్తి భూమినిపితికినట్లు పితుకుచున్నారు—గొడ్డుపోయిన ఆవుకుచేపువెప్పించి కుంభవృష్టిగ పాలు పిండుచున్నారు—ఇక మనమున్న రత్నగర్భయైనభూమినుండి బ్రహ్మాండంమీద కుంచెడు గింజ తీసుకొనుచున్నాము—కడివెడు పాలిచ్చు గోవులనుండి గంటెడు పితుకగల్గినచో ధన్యులమనితలంచుచున్నాము—మనరైతులకు కన్నము లేదు—మనదూడలకు మేతలేదు—మన కూలీలకు పరిశ్రమలు లేవు—మనబ్రాహ్మణులు దరిద్రులు—మన వైశ్యులు నిరాశులు—మనకాపులు ఋణము పెనుగుదియ మెడకట్టుకొని క్రుంగిపోవుచున్నారు—మనహరిజనులకు ఇహములేదు—పరములేదు, పరము లేదు—సంఘము అన్నాతురమై యున్నది—ఘనులమా?

మనపూర్వులు ఘనులైయుండవచ్చును. వారు కరకుశోమలై యుండవచ్చును—వారువిద్యాభోజులై యుండవచ్చును—వారు కుబేరులైయుండిరనుకొనుడు—వేదశాస్త్రములు వారిబుద్ధియొక్క పంటలు—అన్నియు నిజమే—అయితే మనము ఘనులమా కామా రాబోవు సంతతులు నిశ్చయింతురు—

మనకుమోక్షమున్నదా—మనముకృశించికృశించి అకటాసకటకంబడి చదువులేక తూష్ణీపడమరలేకనశించి పోవలసినదేనా—సంఘమే దీనికి సమాధానమీయవలెను—స్వయంసహాయముకన్న మించినతరుణోపాయము లేదు—పూర్వపుపద్ధతులు నేడుపనికిరావని మనవారు గ్రహించినప్పుడే మనకుమోక్షము అన్నకొటకము మునుగ్రహింపుడు—ఒకప్పుడు మనదేశములో యాత్రికునకు, దూరదేశస్థునకుమాత్రము అన్నమునకుఇబ్బంది కల్గుచుండెడిది—ఏవోకొన్ని అన్నసత్రములు అచ్చటచ్చటవేయుట సంతర్పణలు చేయుట మున్నగుసత్కార్యములచే ఈలోటుతీరెడిది. మనధనవంతులు, ముఖ్యముగ వైశ్యసోదరులు ఇదేపద్ధతిని నిలువబెట్టుచు కృతకృత్యులమైతిమని నమ్ముచున్నారు—కాని నేటిపరిస్థితులట్టివికావు నేడు సంవత్సరముపొడుగున ఇంటికూర్చున్నవానికే ఏకభుక్తము, నిత్యఏకాదశి లభించుచున్నది—

ఈభారము బహుళశక్తిసమన్వితమైన ప్రభుత్వముపై ప్రాధాన్యముగ నిల్చియుండునను టనిర్వివాదాంశము— అదృష్టవశమున దయామయులైన శ్రీనిజాంప్రభుత్వమువారు తమయొక్క చ్ఛత్రమునునినియోగించి రైతునకన్నము, వానిపరమునకు గడ్డిపుష్కలముగ లభించువరవులు ఆరంభించుచున్నారు— కానిసంఘముయొక్క సానుభూతి ద్రవ్యసహాయములేకుండ ఇట్టి భగీరథవ్యాపారము జయప్రదముగాజాలదు—మనలో ధనవంతులైనవారు తమతమవ్యక్తిగత లాభములనుమరచి, ధనార్జనమే పరమధర్మమని యెంచక ధనముయొక్క సద్వ్యయమనే పవిత్రాదర్శముగనుంచికొన్నచో మనసంఘమునందు అన్నహాహాకారమను మాట వినబడకుండ పోవును—"నకాంచనసతిం ప్రత్యాచక్షీత, తద్వ్రతం" అను ఉపనిషద్వాక్యమును ఈవిధముగ అన్వయించవలెను— నాయింటికివచ్చినవానికి అన్నములేదని నేనంపను— కానిఅంతతో నా

[౧౧వ పేజీ చూడుడు]




# అపరాధం

శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారు బి. ఏ. బి. ఎల్.

వెంకట్రావు నిజాముకాలేజీలో ఎఫ్.ఏ. లో నాలుగేండ్లు పల్టీలుగొట్టి ఐదోఏడు కామ్యాబు అయినాడు. మెకానికల్ ఇంజనీయరింగులో చదవాలె అని పట్టుపట్టి బెనారసులో హిందూ యూనివర్సిటీలో చేరాలె అని సంకల్పించేసుకొని బయలుదేరినాడు. కాశీ స్టేషను దిగుతూనే ఒక పాండా యెదురైనాడు. ఆయన యెర్రగా, లావుగావున్నాడు. కడుపు బాగా పెరిగింది మంచిస్థూలకాయుడు. మెడలో రెండువరుసల రుద్రాక్షమాలలున్నా చెవులలోకూడా రుద్రాక్షపోగులున్నూ ధరించినాడు. ౫౦ఏండ్ల వయస్సు వుంటుంది. పొట్టిగావున్నాడు. వెడల్పుముఖము. కొంచెము వికారస్వరూపమే. అందివాళ్ళకిందట క్షౌరంచేసుకున్నట్లుంది.

"బాబూజీ! మీదేవూరు. హైద్రాబాదా! మీపేరు?

"వెంకట్రావ్—

"గోత్రం?

"ఆత్రేయస గోత్రం.

"సరే మీతండ్రిగారున్ను మీపెదతాతగారున్ను మాయింటనే బసచేసినారు. మేమేమీ పాండాలము. దయచేయండి. మీకేమిన్నీ యిబ్బంది లేకుండా అన్ని తీర్థస్థలాలు చూపించుతాను-సంకల్పాలు చెప్పుతాన్ను..........

"నాసంకల్పం వేరేవున్నదండీ!

"పర్వాలేదు బాబూజీ! అన్నిటికీ నేనున్నానుగా! మీరేమిన్ని సంకోచించకండి...... ఆరేయ్-ఎక్కా! యిటురా! సామానుతీసుకో_"అంటూతాను గూడా వకచిన్న మూట తీసుకొని "దయచేయండి' దయచేయండి" అంటూ చేయిపట్టి యీడ్చుకొనిపోయి ఎక్కానే ఎక్కించినాడు.

వెంకట్రావుకంతా క్రొత్త స్థలం. ఏమిచేసేది తోచలేదు. గంగెద్దులాగా పాండావెంటవెళ్లినాడు. లాజపతిరాయిరోడ్డులో పాండాయింటి వద్ద ఎక్కాబండి ఆగింది. సామాను దించుకుంటూవున్నారు. పాండా తానే ఎక్కావాని చేతిలో ౫అణాలుపెట్టి పంపివేసినాడు. వెంకట్రావు బండి దిగుతూవుండగానే పాండా యింటియెదుట ఒకగదిలో ఒకయువతి కనబడ్డది- వేంకట్రావుకు కండ్లలోనే మెరుపు మెరిసినట్లైంది. చూచీచూడకముందే ఆయువతిచూపులున్ను ఇతనిచూపులున్ను భేటీఅయింది. ఆమె ఛటాలున తలుపుచాటు సగంమూసి రెక్కచాటునుండి ఒకస్తనం బయటపెట్టి ముఖంవంచి తొంగితొంగి చూడబట్టింది.

మనవెంకట్రావు మంచి విలాసపురుషుడు. అందుచేతనే ఎఫ్ ఏ. ప్యాసుకావడంవరకుఆయన వయస్సు ఇరవైయ్యేడో సంవత్సరముదాటి యిరవైయెనిమిదో సంవత్సరంలో ఉన్నగా కాలుపెట్టింది-చదువూ సంధ్యల్లో మొద్దనిపించుకున్నా[ అందులో గణితశాస్త్రములో చాలామార్లు నూటికి ౫-౬ మార్కులతో సంతృప్తిపడినా ] ఆయనలో కామశాస్త్రం బాగా గడించినాడు; సుందరరూపి, ఖుబ్సూరత్తుగా వున్నాడు. ౫అడుగులా ౭౪అంగుళాలయెత్తు_పేర్వాసీలాగూ చిన్నప్పటినుంచేతలవాటు చేసుకున్నాడు. ఎఫ్.ఏ.కు వచ్చేవరకు తుర్కీటోపీ పెట్టేవాడు. కాని తర్వాత[ కాలం మారుతున్నందుచేత ]నల్లనిబొచ్చుటోపీ ధరించబట్టినాడు. ఆయువతింతకొలుచూచినది అనుకూలమైనదేకోరేఅని వెంకట్రావుతక్షణమే నిశ్చయంచేసుకున్నాడు. తానువచ్చినకార్యం కూడా మరచిపోయినాడు. పాండా అతనికి ఒక కొట్టిడీచూపించి భోజనానికికూడ పిలిచాడు. యిద్దరూభుజించినారు. అప్పటికి మధ్యాహ్నం దాటి ౨గంటలపొద్దయింది. పాండా తనకార్యంమీద పట్నంలోకి పోయినాడు. వెంకట్రావుకొట్టిడీ యించుమించు ఆయువతికొట్టిడీ కెదురుగానేయుండడం తనఅదృష్టమే అనుకున్నాడు. అయనకిప్పుడు నగరం చూడవలెనని గాని, కాలేజీవివరాలు విచారించుకోవలెనని కాని ఏమిన్నీ బుద్ధిపుట్టలేదు. సిగరేటు ఘాటుగాపీలుస్తూ తనకొట్టిడీలో కిటికీవద్దకూర్చుని యెదురింటివైపుచూస్తూ ధ్యానసమాధిలోతన్మయుడైపోయినాడు, ఆయువతి కనపడలేదు. కాని వెంకట్రావుకు చదువులో లేకున్నా ఇట్లాంటిసందర్భాలలో పట్టుదల మెండు. సాయంకాలం ౬గంటలలోనే యువతి తలుపువద్ద ప్రత్యక్షమైంది. వెంకట్రావు తనకిటికీచప్పుడుచేసి,ఆమెదృష్టిఆకర్షించుకున్నాడు. ఆమెఅతన్ని చూచి కొంతసిగ్గుపడినట్లునటించి పైటసవరించుకొని ముసిముసినవ్వులతో వంచిన తలయెత్తి క్రేగంటితో చూచింది. వెంకట్రావుకిశరీరమంతా పులకించి తనలో ఇట్లాఆలోచించుకొన్నాడు.

"ఆరే ఎంతఅందంగావుందిరా యీ స్త్రీ- ఇంట్లోయెవరూలేనట్లుంది- ఇరవైయేండ్లుంటాయేమో! ఆశరీరసౌష్టవం, ఆమొగిలిరేకుచాయ, అదొంగచూపులూ, ఆకోలముఖం, అముద్దువచ్చే పెదవులూ,......

మా హైద్రాబాదులో ఎన్నడైనా ఇట్లాంటి దాన్ని చూచినామా! దూరాన్నుంచి చూచేవరకే శరీరమంతా ఉల్లాసపట్లాఅయిందే! ఆరే! అమృదువైనసుందరమైనహస్తము మీదపడేవరకూ, ఆ పెదవులమధ్యఒక్క పేఒక్కటి చెంపపై పడేవరకూ! అఆందమైనకంఠముతో నోటినిండాపిలిచి మాట్లాడించేవరకూ, ప్రాణాలునిలువవనే లేచిపోతవోయేమో!......

ఇట్లా భావనోసానలమీద నోసోనాలు ఎంతసేపుకట్టుకుంటూ ఉన్నాడోయేమో పాపం వేంకట్రావు-కటాలునఆయువతిచేయి తనతట్టువిసరినట్లుకనబడింది-వెంకట్రావుకుఆదపడి కండ్లునులుముకొని చూచేవరకుఆయువతి పక్కనవవ్వినట్లుకనబడింది-ఏమైనాకానీఅనిలేచినాడు-అటూయిటూచూస్తూ ఆమెగదినిసమీపించినాడు-ఆమె దాపునపోయింది- వేంకట్రావు ధైర్యంచేసి ఆమెగదిలోకాలు పెట్టినాడు.

"దయచేయండి! ఆగదిలోకూర్చోండి! తమదేవూరు-మీరీవూరికి క్రొత్తవారుగా ఉన్నట్లుంది"అనింది ఆమె.

వేంకట్రావు లోపలికొట్టిడీలోని మంచం మీద కూర్చున్నాడు.

"మాది హైద్రాబాదు-కాశీ చూస్తామని వచ్చినాను; మీదీవూరేనా? మీపేరేమి? మీవాళ్లెవ్వరూలేరూ?

"మాదిప్పుడీవూరే లెండి! నాపేరిప్పుడు రాంకుమారీ- నాకిప్పుడెవ్వరూ లేరు-

"ఆరే! అన్ని యిప్పుడూ యిప్పుడూ అంటావు-అయితే ఇంతకుపూర్వం సంగతికూడా చెప్పరాదూ_

"ఆకథ చాలావుందిలెండి-మీది హైద్రాబాదంటిరే మీరేమిభాష మాట్లాడుతారు?

"తెనుగూ!

"ఆదే! మిమ్ముచూచినప్పుడే మీరు తెలుగువారే అయివుంటారనుకున్నాను" అని రాంకుమారి యింతవరకు హిందీలో మాట్లాడినా యిప్పుడు అచ్చంతెనుగులో మాట్లాడింది.

"హాయ్! నీవుతెనుగుబాగావస్తుందే! నీదంతా అయోమయంగానేవుంది. ఈవూరంతాయిట్లే వుందారేమి? పాతచుట్టంవలె ఆసాంబానన్ను లాక్కొని తనయింట్లో కూలవేసిపోయెను. నీవైతే కొత్తచుట్టంవలె చూపుల్తోనే నీయింట్లోకిలాక్కొంటివి. పైగాఅంతా విచిత్రంగావుంది నీకథ. నీవెవ్వరో నాకు మొదట తెలుపు.

"ఈవాళ రాత్రికిదయచేయండి. తెలుపుతానుగాని.

"సరేవస్తానులే. ఇప్పుడుచెప్పరాదా?

"మీపాండావస్తాడు. మీరిప్పుడువెళ్ళండి.

"సరే! అట్లేకానీలే" అంటూ వెంకట్రావు రాంకుమారీచేతిలో ౫రూపాయీలనోటుపెట్టినాడు. ఆమెనవ్వుతూ విలాసంగాచేయిసాచింది. కటాలున వెంకట్రావు ఆచేయిపట్టి వదిలేలాగిగట్టిగాకౌగలించుకొని ముద్దుపెట్టుకొన్నాడు.

"అబ్బా! వదలండి! యిదేమిసరసం! యెవరైనాచూస్తారు. మగవాళ్లకెంతసిగ్గులేదండీ.

"భోగంవాండ్లకైతే సిగ్గుంటుందికాబోలు.

"భోగంవాండ్లెవరు?

"నీవుకావా!

"మీవంటివాండ్లంతా హిందూసంఘంలో నిండిపోయినప్పుడు నావంటివాండ్లకు భోగంవృత్తిగాకుంటే ఇంకేమివృత్తి మిగులుతుంది... ......సరేకానీ మీరువెళ్లండి.

వెంకట్రావుఆమాటా ఈమాటామాట్లాడిమరికొంతసేపటికి బయటపడినాడు. ఇంతలో పాండావచ్చినాడు "బాబూ! తాము ఎక్కడావెళ్ళలేదా? బాబా విశ్వనాథజీదర్శనానికి వస్తారా? రండి నేనక్కడికే వెళ్లుతున్నాను"అని మందలించినాడు.

"అక్కరలేదుబాబూ, నేనుకొస్తా నాలుగుపేఠులూతిరిగివస్తాను. రేపుదేవాలయానికి పోదాంలెండి.

"చిత్తం! చిత్తం-మీకేమిన్నీ యిబ్బందిలేదుకదా!" అంటూపండా వెళ్లిపోయినాడు.

వెంకట్రావున్ను తనకొట్టిడీతాళంవేసుకొని నగరంవిశేషాలు చూచేదానికని బయలుదేరినాడు. ఆసందూయీసందుతిరుగుతూ "దాల్ కీమండీ"కి వెళ్లినాడు. బనారసులో దాల్ కీమండీ చాలప్రసిద్ధిపొందినస్థలం. వీధిలోనియిండ్లల్లో క్రిందిభాగములో దుకాణాలున్నవి. విశేషంగా మహమ్మదీయులు గ్లాసుసామానులుపెట్టుకొని వ్యాపారంసాగిస్తూవుంటారు. పైభాగాలలోనంతా భోగంవారుంటారు; వేలకొలదిగాఉంటారు. వీరొక్కప్రాంతమువారుకారు. బొంబాయి, నాగపూరు, పంజాబు, బీహారు, నేపాలుప్రాంతాలనుండి వచ్చినవారున్నారు_ విశేషంగా బంగాలీలున్నారు- వీరిలోచాలామంది భర్తలుచనిపోయినతర్వాత దిక్కులేనివారై బనారసుకువచ్చి వ్యభిచారవృత్తిచే జీవనంగడుపుతారు- వెంకట్రావు ఈమండీలో కొంతసేపు అటూయిటూతిరిగి ఎనిమిదిగంటలరాత్రివేళకు తనబసచేరుకున్నాడు-

పండా అతనికొరకు ఎదురుచూస్తూవుండినాడు- వేంకట్రావువస్తూనే భోజనాలైనవి-కొంతసేపటికి పండాతలుపువేసుకొని పండుకున్నాడు- వెంకట్రావుకిచ్చినగది బయటివరండాప్రక్కనే బయటిదిక్కు-ఉండడంచేత ఆతనికి అనుకూలంగాపడిరింది-

రాంకుమారీవద్దికివెళ్లే సన్నాహాలుమొదలుపెట్టినాడు- సిల్కుఅంగీతొడిగినాడు- ఇస్త్రీచేసిన సన్నని పంచె తోలుపెట్టెలోనుంచితీసి కట్టుకున్నాడు- రుద్రాక్షఅంచుసెల్లా బుజముమీదవేసుకున్నాడు- సూటుకేసులోనుంచి సెంటుసామానుతీసినాడు- కాస్మటిక్ రాచి వడిసాపటతీసిదువ్వి బ్రష్షుతో క్రాపును మార్గానికి తెచ్చి అకొమ్మ ఈకొమ్మ రెండు మెలికలుపడ తిప్పినాడు- మీసాలకు కాస్మటిక్ అంటించ దబ్బనాలవలె మొనలుతీర్చినాడు- ఒకసిల్కుదస్తీ పైజేబీలో కొంచెము బైటికికనిపించేలాగు మడిచిపెట్టుకున్నాడు- అద్దములో మొఖము మరొకమారుచూచుకొని సమాధానపడి సెంటుసామాను మరలసూటుకేసులో పెట్టివేసినాడు- కొట్టిడీతాళంవేసుకొని చక్కగా "పాన్ బీడా దుకాణంవద్దికివెళ్లి ఒకరూపాయ ఖుంగునవాయించి,

"భయ్యా, నాల్గుఫస్టుక్లాసు పాన్ బీడాలు కట్టియ్యి. డబల్ ఛార్జిచెయ్ కాని బీడాలు అవ్వలుదర్జావియ్- తెలిసిందా. ఇదోఒకసిసర్సుడబ్బీ, ఒకఅగ్గిపెట్టె ఇట్లాపడేయ్-"అని దర్జాగాహుకుంచేసినాడు- భయ్యా మనిషినిఎగాదిగాచూసి అడిగినవిస్తూ ఏడణాలు వాపసు ఇచ్చినాడు- వెంకట్రావుతయ్యారీలన్నీ పూర్తిఅయినవి- నేరుగా రాంకుమారీ యింటికే దారితీసినాడు-

రాంకుమారీ యింటితలుపు నాజూకుగా తట్టినాడు. ఆమెతలుపులుతెరిచి మునుపు సినవ్వులతో ఆహ్వానంచేసింది. రాంకుమారీకూడా బాగా ముస్తాబైంది. పక్కపాపటతీసి జడ్డాముడిలో మల్లెపూలు అర్ధచంద్రాకారంగా చెరిచిపెట్టుకొన్నది. గులాబీరంగుచీరకట్టింది. పచ్చనిరైకతొడిగింది. తాంబూలమునములుతూవున్నది. మొదలే యెరుపైనపెదవులు. ఆతాంబూలంరంగుతో యింకా శోభాయమానంగావున్నవిఅవి. కండ్లకు కాటికపెట్టింది. వెంకట్రావును విలాసంగా తనపడకగదికి తీసుకొనివెళ్లుతూవుంటే అత్తరువాసనలు ఘుమఘుమాయిస్తున్నవి.

"తాంబూలంవేసుకోండి"అని పాందాన్ ముందుపెట్టింది, "ఉండండి! నేనే చేసియిస్తాన్"అంటూమళ్లీ తానే పాందాన్ లాగుకు

[౧౧వ పేజి చూడుడు]

# తెలంగాణా వార్తలు

## ఆంధ్రోద్యమము

[జిల్లా ప్రచారకుడు]

నల్లగొండజిల్లా ఆంధ్రసంఘము రామగిరి రంగనగరంలో శ్రీ పులిజాల వెంకటరంగారావుగారి భవనమున ౩౧-౯-౪౬ తేదీ సాయంత్రం ౫ గంటలకు సమావేశమై హైదరాబాద ఉన్నత బాలికాపాఠశాలలో మెట్రికుచదువ నుద్దేశించిన ఒకబాలికకు (౧) సంవత్సరంవరకు సంఘపక్షమునుండి స్కాలరుషిప్పుక్రింద మొత్తం (౧౦) మాసములకును (౧౦౦)రు రూపాయీలు శ్రీ నడింపల్లిసుందరమ్మగారి పోస్టలు వ్యయము భరించి బంపుటకు తీర్మానింపబడినది.

తీర్మానములు

(౧) నల్లగొండజిల్లానుండి ఉన్నతవిద్యకై పంపబడుచున్నవీరు ఈజిల్లాసేవకే ముందు తమ విద్యఉపయోగించుటకు సంఘమువారుకోరుచున్నారు.

(౨) సంఘసభ్యులు అభిమానులు తమతమ శక్తికొద్ది సహాయపడవలయును. మిగిలిన ద్రవ్యమొత్తమును శ్రీ కొమర్రాజుకోటేశ్వరావు పంతులుగారు భరించుటకుమిక్కిలి ఉదారహృదయముతో ఒప్పుకొనిరి, దానికై సంఘమువారు కృతజ్ఞతావందనము లర్పించుచునారు.

౧-౧౦-౪౬ ఉదయం ౭ గంటలకు మొదటితీర్మానాభిప్రాయమునువిద్యార్థినికి వినిపించ జిల్లాసంఘసేవచేసెదనని వారి ప్రత్యుత్తరాంగీకారమును బడయపడినది.

## నల్లగొండ

[ఒక విలేఖరి]

౩౦-౧౦-౪౬

రామగిరి రంగ నగరంలో శ్రీ ఉ వే. కే. నృసింహాచార్యులుగారు గృహప్రవేశకాలమందు స్థానిక ఆంధ్రజనసంఘమునకు [౧౫] రూప్యములు విరాళ మొసగి మార్గదర్శకులైనారు. ఆంధ్రనాయకులకును, బస్తీజనులకు భోజనము మరియు అల్పాహారపువిందొసంగిరి.

## పానగల్లు

[జిల్లా ప్రచారకుడు]

శ్రీ ప్రతాపరుద్రాంధ్ర భాషానిలయమును చూచుభాగ్యములభించినది నిలయారంభమునుండింతవరకు విశ్వబ్రాహ్మణసోదరులే నిర్వహించుచున్నారు. ముజంపల్లి లక్ష్మణమూర్తి గారి స్వంతగృహమందొకభాగములో అద్దెలేకుండా గలదు. జిల్లాఆంధ్రజనసంఘ కార్యనిర్వాహక ప్రముఖులును విఖ్యాతోదారులగు శ్రీశ్రీ తాహూరుహరిసింగుగారు చదరం[౧౦౦]ఫీట్ల భూమిని దానము చేసినదేకాక పట్టినంత కల్పుగూడా నొసంగెదమని వాగ్దానము చేసియున్నారు.(వీరు కల్పుగుత్తేదారులు) గ్రంథాలయ నిర్వాహకులు గృహనిర్మాణముచేయించు నుత్సాహముకలవారైయున్నారు-

ప్రతిశుక్రవారం పత్రికాప్రవచనమును శనివారం భజన జరుగుచున్నది-దాదాపు ౨౦మందిమాత్రమే ఇందు పాల్గొనుచున్నారు. గ్రామప్రముఖులు తమయువజనులానర్పు సర్వజనోపయోగకార్యములందు శ్రద్ధాదరముల చూపుటత్యవసరము-

## జంగంపల్లి

[ఒక విలేఖరి]

౭ వేల రూప్యముల దొంగతనము

కామారెడ్డితాలూకాలోని యీ గ్రామమందు ౨౫ అమర్దాదురోజున గుండావీరయ్య యను వైశ్యునియింటిలో సాయంకాలంవేళ డాకాజరిగినది- జిల్లాపోలీసు మొహతమీంగారికి దెలుపబడినవెంటనే వారువిచారించిరి. ౨౭ అమర్దాదునాడిద్దరు అరబులు యీ సందర్భములో జాల్నాయందు పట్టుబడిరి- వారివద్ద సుమారు వేయిరూప్యములవస్తువులు చిక్కినవి. ఈడాకాయందు ౭వేల రూప్యములపహరింపబడినటుల దెలుపబడినది. నగరరక్షక శాఖవారి సాయమున జిల్లాపోలీసు నగరమునందు కళస్త్రీలైన నలుగురరబులను చాకచక్యముతో నిర్బంధించెను. స్పెషల్ మెజస్ట్రేటుగారివద్ద చాలాన్ చేయ పోలీసుకువిచారణకై ౧౫ రోజులగడువివ్వబడినది.

## కల్వకుర్తి

[ఒక విలేఖరి]

కపిలేశ్వరగ్రంథాలయ ప్రారంభోత్సవము

ఈఆషాఢ శు ౧౦లు శుక్రవారంరోజున ఈ జిల్లాసంఘపు కార్యనిర్వాహకవర్గ సమావేశము జరిగియుండెను. సమావేశమునకుముందు పురప్రముఖుల సమావేశములో శ్రీయుత యం. నారాయణరావుపంతులుగారు గ్రంథాలయముల ప్రయోజనములు విపులముగా తెలియపర్చుచు పైగ్రంథాలయ స్థాపనోత్సవముజరిపిరి. కార్యనిర్వాహక సభ్యులెన్నుకొనబడిరి.

గ్రంథాలయమునకీ పత్రికలు సభ్యులిచ్చుట కంగీకరించిరి.

ఆంధ్రవారపత్రిక, గోలకొండపత్రిక, రయ్యతువారపత్రిక, ముషీరుదక్కన్, పయామ్, మరాటీపత్రిక, మద్యపాననిరోధకపత్రిక.

విరాళములు

ఈక్రిందివారు చందాలవాగ్దానము చేసిరి-

రామచంద్రారెడ్డిగారు,రు. ౧౦-౦-౦ రామారెడ్డిగారు, ౧౦-౦-౦ వెంకోబరావుగారు ౧౫-౦-౦ జానకిరామరావు, ౫-౦-౦ వెంకన్నవకీలు ౫-౦-౦ బి.యన్.దాసు ౫-౦-౧, వెంకటరంగంగారువకీలు ౩-౦-౦, తిరుమలరావు ౩-౦-౦, పోతేదారువెంకన్న ౫-౦-౦,పర్మయ్యగారు ౫-౦-౦. గుండాబుచ్చయ్యగారు ౫-౦-౦, అర్జునసింగు ౨-౦-౦, చింతలశాయిరెడ్డి ౫-౦-౦, యితరులు ౨౦-౦-౦.

శ్రీయుత రామిరెడ్డిగారి అల్పాహారవిందుతో సమావేశము ముగిసెను-

## మహబూబ్‌నగర్

[ఒక విలేఖరి]

టి- కరుణమ్మ ప్రధానోపాధ్యాయినిగారు తమపదవిని ప్రస్తుతము ద్వితీయోపాధ్యాయినిగానుండు, అగమ్మపంతులమ్మగారికియిచ్చి కారంపేట ప్రధానోపాధ్యాయినిగా మారినటుల దెలియుచున్నది-

## కారేపల్లి

[ఒక విలేఖరి]

కారేపల్లి ౮ ౯-౧౦-౪౬

కీర్తిశేషులగు మ॥రా॥శ్రీ పర్చ సీతారామచంద్రరావుగారియందు తమకుగలసోదరవాత్సల్యతను వెల్లడించుటకుగాను స్థానికసంఘములగు భారతయువజనసంఘము, వరంగల్లుజిల్లా హరిజన సేవకసంఘము, వర్తకసంఘములపక్షమున యీదిగువ కార్యక్రమమును జరుపబడియునది-స్థానికవర్తకసోదరులందరును తమ దుకాణములను, వర్తకవ్యవహారములను, కట్టిపెట్టి చిన్నహర్తాలునుజరిపిరి. రాత్రి ౯గంటలకు స్థానికవర్తకులును, భారతయువజన సంఘసభ్యులును, హరిజన సేవకసంఘసభ్యులును [తమహరిజన సోదరులతోసహా]రైతు సోదరులును సుమారువందమంది శ్రీ వెంకటేశ్వరస్వామివారి యాలయావరణమునచేరి కీర్తిశేషులవారియాత్మకు శాంతినొసగుటకయి నిశ్చలమనస్సుతో యేకకంఠముగ భగవంతునిప్రార్థించిరి-

౮ ౯-౧౦-౪౬ ఫసలీన భారత యువజన సంఘపు కార్యనిర్వాహక సభజరిపి కీర్తిశేషుల వారికుటుంబమునకు తమసానుభూతిని తమ ప్రధాన కార్యదర్శిద్వారా నందజేయుటకయి తీర్మానించిరి-

---

ఆయుర్వేదఫార్మసీ

శ్రీయుత టి-వి-భాస్కర్ బి.ఎస్.సి గారు శాస్త్రోక్తముగా ఆయుర్వేదయౌషధములను తయ్యారుచేయుటకొరకు ఫార్మసీని నెలకొల్పియున్నారు-

ఇండ్లపన్ను హెచ్చించుట

యిండ్లపన్ను గత సంవత్సరమునకంటె హెచ్చించినందులకు పురవాసులు అవ్వలుతాలూకుదారుగారికి దరఖాస్తుసమర్పించుకొనిరి.

---

## రామాయంపేట

(ఒక విలేఖరి)

ఆంధ్ర క్షత్రియ కుల పునరుద్ధరణ సభ

శ్రీ ఈశ్వర నామసం॥ ఆషాఢశు॥ ౫ సోమవారం శ్రీయుత పడాల హన్మంతరావుగారి అధ్యక్షత క్రింద విజయనగర సంస్థానమునకు సంబంధించినవారును, ఇబ్రాహీం కులీ కుతుబ్ షాగారి కాలమున గోలకొండ రాజ్యమునకు వచ్చి వారిచే మున్నె వార్ సర్ మున్నె వార్ హోదాలపై నిలుపుకొనబడినవారు నగు క్షత్రియ సోదరులు దాదాపు (౪౦) మంది శ్రీయుత కె. సుదర్శనరావు గారి యింటిలో సమావేశమైరి. ఉత్పల వెంకటరావు గారు వంశావళి పూర్వ చరిత్రను (వివర) ఆధారముల తో విశదపరచిరి. క్షత్రియజాతికి తగిన యాచారముల ధర్మములను పాలించుట కందరు సమ్మతించిరి.

ప్రస్తుతమీ క్షత్రియసోదరులు ఏకాలదమం దిమో తప్ప కక్కినవారు యజ్ఞోపవీతములు లేక క్షత్రియకులోచిత సంధ్యావందనాదులు లేక మెలంగుచున్నారు. గాన జాతీయధర్మల పునరుద్ధరించుటయు, బాల బాలికా విద్యావిషయమై ముఖ్యముగా ఉన్నత విద్యకై యొక్కువ శ్రద్ధ తీసుకొనుట గురించి ఉత్పల వెంకటరావు. యస్. రాంకిషన్ రావు గార్లు మాటలాడిరి. సభ్యులందరు మంచి యుత్సాహము గనపరచిరి.

## నెఱసిన వెంట్రుకలు నల్లబడుటకు



నీవెంట్రుకలెంత నెఱసినను, విశాలైను హారాయిలు వాడినచో, వాటికి సహజమైన నల్లని నిగనిగ కుదుళ్లనుండియు ఏర్పడును. మందు చల్లగా పనిచేయును. రంగులు వేయవలదు— విశాలైను నేటినుండియే ప్రారంభించుము— నెఱపుట్టిఎక్కువకాలమైనచో పెద్దసీసా రూ ౩ లు చిన్నసీసా రు ౧-౧౨-౦ లు మూడుసీసాలు [పూర్తిగా గుణమిచ్చుటకు] కొన్నచో టపాఖర్చు మేమే భరింతుము—

డిస్ట్రిబ్యూటర్లు:— యస్. పి. అండుకో, [మెడికల్ డిపార్టుమెంటు, పి-బి బాక్సు ౧౦,౦౦౬, కలకత్తా, [౧౫]

## నోటీసు

ఈక్రింద సంతకముచేసినవారు యిందు సంబంధముగలవారికందరికి తెలియజేయుట ఏమనగా, శికింద్రాబాదులో "సుబ్ కరణ్ రాంగోపాల్" బట్టలదుకాణము భాగస్తులచే జాయింటుగా ౧-౮-౧౯౩౭ వరకు నడపబడుచుండినది. ౧౨-౭-౧౯౩౭ తేదీన తీసివేయడమైనది. అందుకుగాను యీ క్రింద సంతకము చేసినవారికిని, మరి యిద్దరు భాగస్తులు ౧ గోపికిషన్ ముర్లీధర్, ౨. మరిపల్లి మాణిక్యం లకును మధ్య ఒక ఒడంబడిక వ్రాయబడి౧౨-౭-౧౯౩౭ తేదీన రిజిష్టరీ చేయించనైనది. ఈక్రింద సంతకముచేసినవారు, పైదుకాణము యొక్క ఆస్థిని అప్పును తమస్వాధీనము చేసుకొన్నందున యికముందు యీ దుకాణమునకు రావలసినబాకీలను యిదివరకు పైదుకాణము పేరడిక్రీఅయిన మొత్తములను వసూలు చేసుకొనుటకు హక్కుదారులై యున్నారు. కనుక ఈ దుకాణమునకు బాకీయున్న వారందరకు తెలియజేయడమేమనగా తమతమ బాకీలను యీ క్రిందివారికి స్వయముగాయిచ్చి రసీదులు పొందవలయును. లేదా, కైలాసశేర భయ్యా, బట్టలదుకాణం, పొగాకుబజారు శికింద్రాబాదు వారిద్వారా మాకు చెల్లించి రసీదుపొందవలెను.

శికింద్రాబాదు ౧౬-౭-౩౭ } ౧, సాలికకాశయ్య. ౨. సరాఫ్ రాజయ్య.

## గోలకొండ కవులసంచిక

| | | |
|---|---|---|
| చందాదారులకు | వెల రు | ౧-౦-౦ |
| ఇతరులకు | ,, ,, | ౨-౦-౦ |

## ఆయుర్వేద ఆశ్రమ ఫార్మసీ, లిమిటెడ్

అహమదునగరు

సలహా వైద్యులు:— వైద్య పండిత గంగాధర శాస్త్రి గోనె

## రక్తదోషాంతకము

[రిజిష్టర్డు]

సీసా ౧ కి ౧రూపాయికల్లారు　మహసూలు ఖర్చుగాక

ఔషధము రక్తమును శుద్ధిచేయుటకు లాభకారి. ప్రవృత్తులు మంచిగాఅగును. మాత్రను నిరాటంకముగా వెడలును. జీర్ణశక్తి కలిగించును. శరీరము నెల్లప్పుడు ఆరోగ్యముగ నుంచును. ఈఔషధము బాలుర, యువకులు, వృద్ధులెల్లరును ఉపయోగించిన లాభము చేకూరును. గోకుడు, గజకర్ణి, తేది, ఉపదంశము, నెత్తురు చెడిపోవుట, సెగ, మొదలగు అన్ని విధములైన అంటురోగములకు అమృతమువంటిది. మీరు ఒక సీసానువాడిన మీకేవిశ్వసము కొగలదు.

ఆయుర్వేదపు అన్నివిధములైన తృప్తికరమైన ఔషధములు దొరుకును.

## నిజాంరాష్ట్రమునకు ప్రతిచోట ఏజంట్లు కావలెను

౧ వ శాఖ
ఆయుర్వేద ఔషధాలయం
కోత్వాలిబావిడి పూనా నం. ౨

౨వ శాఖ
౧ వ కాంబెవాడి గోసా.
గిర్గాం బొంబాయి నం. ౪

౩ వ శాఖ
భూపాయి గేలురోడు
అమరావతి (బిరారు)

౪ వ శాఖ
సుల్తాన్ బజారు, బస్ స్టాండు
హైదరాబాదు — దక్కన్.

# మ. ఘ. వ. నైజాం స్టేటు రైల్వే

## మషీరాబాద్ (హైద్రాబాదు) ఔట్ ఏజన్సీ

## తెరువబడుట

1 ఆగస్టు 1937 తేదినుండి మషీరాబాదు(హైదరాబాదు)లో ఒకఅవుట్ ఏజన్సీ తెరువబడి, లోకల్ లోను, త్రూగాను సామానుల ఎగుమతిదిగుమతులు చేయబడును. జంతువులు, చెడిపోవు పదార్థములు, అపాయకరములైన వస్తువులు, మందుగుండు సామానులు యీఔట్ ఏజన్సీద్వారా ముందుగా రోడ్డుట్రాన్సుపోర్టేషన్ సూపరింటెండెంటుతో ప్రత్యేకపు ఏర్పాట్లు గావించుకొనిననేగాని తీసుకొనబడవు.

2. ఈఔట్ ఏజన్సీ శికింద్రాబాదు స్టేషన్ కు సంబంధించియుండునుగనుక మషీరాబాదునుండి స్టేషన్ కు తీసుకొనివెళ్లుటకు మణుగు 1కి 6 పైసలు అదనముగా చార్జి యివ్వవలయును.

3. రైల్వేభాగపు చార్జిగాక ఔట్ ఏజన్సీ చార్జి 4 అణాలు అదనముగా ఒక్కొక్క డాగుకు చార్జిచేయబడును.

4. ఈ అవుట్ ఏజన్సీనుండిగాని, యిక్కడికివచ్చునట్టిగాని ఒక్కొక్కడాగు 12 మణుగుల బరువు మించియుండగూడదు.

5. పై జెప్పిన బరువుకంటె మించిన డాగులు ప్రత్యేకపుఏర్పాట్లులేక యిక్కడ బుక్కుచేయబడవు.

6. నైజాంస్టేటు రైల్వేలో ఆమలులోయున్న సరకులబుక్కింగు నియమములే యీ అవుట్ ఏజన్సీలోగూడ ఎగుమతి దిగుమతులకు అనుసరింపబడును.

హెచ్. ఎ. ఔట్ వైటు
చీఫ్ కమర్షియల్ మానేజరు

## ప్రకటన

ఇందుమూలమున శ్రీదత్తాత్రి పార్ కంపెనీ లిమిటెడ్, నాంపల్లి హైద్రాబాదు.దక్కన్, వాటాదార్లకు తెలియజేయడమేమనగా ఈ దిగువ విషయములను చర్చించి తీర్మానించుటకు అసాధారణసభ ౧౯౩౭ జూలై నెల ౩౦ వతేది శుక్రవారము (౨౮ మహారేవరు ౧౩౪౬ఫ.) పగలు ౧ గంటకు సదరు కంపెనీ నాంపల్లి కార్యాలయమున ఏర్పాటు చేయడమైనది. కాబట్టి పైకంపెనీ వాటాదార్లయిన వారందరు ఆమీటింగునందు పాల్గొనుటకై సకాలమునకు దయచేయ ప్రార్థితులు.

చర్చనీయాంశములు

౧. కంపెనీయొక్క ప్రస్తుత పరిస్థితులనుగురించి ఆలోచించుట.
౨. ౨౨వఏప్రిలు ౧౯౩౭సాదు అర్ధవార్షికమహాసభయందు వాలంటరీ లిక్విడేషనుగురించి చేయబడిన తీర్మానమును ఆలోచించుట.
౩. కంపెనీ ఆపివేయబడు విషయమున తమఅసమ్మతిని సూచించుచు పంపబడిన వాటాదారులదరఖాస్తులనుగురించి చర్చించుట.
౪. కంపెనీ వ్యవహారమందు బాధ్యతగలవారు నియమములకు వ్యతిరేకముగా సంచరించినందున గలిగిన నష్టపరిహారమును గురించి తగుచర్య దీసికొను విషయమును చర్చించుట.
౫. కంపెనీయొక్క వాటాదులారీ వేలము వేయుటనుగురించిన పత్రవ్యవహారము.
౬. కంపెనీయొక్క ఖజానుదారు ఉద్యోగమునుండి తొలగింపబడినను చార్జిఅప్పగించని విషయము.
౭. అప్పటినిగాని కంపెనీవ్యవహారములు జరుపవలసినదని డైరెక్టర్ల మీటింగులో చేయబడిన తీర్మానమును ధృవపరుచుట.
౮. కంపెనీ లెక్కలను తనిఖీచేయుటకు ఆడిటర్లను నియమించి వారి ప్రతిఫలమును నిర్ణయించుట.
౯. కంపెనీయొక్క అనవసరమైన, కార్గాని, హైద్రాబాదులోఉన్న లారీ విక్రయించుటనుగురించి ఆలోచించుట.
౧౦. తెలబారీపేటతో భంతు జమీందారీ వసూలుచేయబడిన రొక్కమును లెక్కాచార ప్రకారము వినియోగించుఅధికారము కంపెనీ స్వాధీనము చేయుట.
౧౧. కంపెనీకిరావలసినబాకీలు వసూలుచేయుటనుగురించి డైరెక్టరమీటింగులో చేయబడిన తీర్మానమునుగురించి ధృవపరుచుట.
౧౨. సమయోచితేతరాంశములు.

ఇట్లు
డైరెక్టర్ల సంఘపు ఆజ్ఞప్రకారము.
మా దా సు కిష్టన్న
మ్యానేజింగు డైరెక్టర్




# గోలకొండ పత్రిక

ఈశ్వరనామ సం॥ ర ఆషాఢశు॥ ౧౧

సోమవారము


## సమిష్టి ఆదర్శము

—

హైద్రాబాద రాజ్యము నందలి హిందూ మహమ్మదీయుల మనస్పర్థ లంతమొందించి వారియం దంకురింపనున్న వైషమ్యముల నిర్మూలించుటకు దీక్షాబద్ధులైన ప్రజాసేవకుల ప్రయత్నములు ప్రశంసనీయములు. ఈ యుభయసంఘములందు పరస్పర స్నేహభావములు పెంపొందింప చేసి వీరియందు సమిష్టిత్వము, ఐకమత్యము స్థిరీకరించు నున్నతాదర్శములు గర్వనీయాంశములు. దేశాభ్యుదయ మూలంహ్యము వీరెరింగి తదానుగుణ్యముగా కృషిసలుపుటకు బూనుకొనిన యనతి కాలములో నిర్ణీతాదర్శములు సఫలవంతములగు ననుట నిశ్చయము.

ఈరాజ్య మనాదిమండి సోదరసంస్థానముల కేగాక బ్రిటిషుభారతదేశమంతటికి యాదర్శప్రాయముగా గణింపబడినది, కాదు గౌరవింప బడినది. ప్రజాహిత పరిపాలనమునకు దీనికి పెట్టినదిపేరు. ప్రజలందరు దీనిని రామరాజ్యముగా వాడుకొనుటచూచి సహించలేక యీర్ష్యభావోద్రేకులై రాజ్యమందలి వివిధసంఘములందు, వివిధమతావలంబకులలో వైషమ్యబీజములనాటి రాజ్యమును పైశాచికనాట్యమునకు క్రీడారంగముగా నొనర్చుటకు సలిపిన సలుపుచున్న ప్రయత్నములు కొంత వరకు నెరవేరినవి, నెరవేరుచున్నవి. దేశమునందు విచ్చలవిడిగా తాండవమాడుచున్న అజ్ఞానాంధకారమువలన నోరెరుగని అమాయక ప్రజ లీకుతంత్రుల మాయోపాయములు గ్రహించిన, భావిపరిణామము కనుగొనలేక, దుర్బోధలవలన యుద్రేకపూరితులై పరస్పర రక్తపానమునకు దాహపీడితులగుచుండుట శోచనీయము. రాజ్యమునందంతట బహిరంగముగా, ఎంతవరకీ కార్యము నెరవేరగలదో చూచుటకే యభిలషింప బడినదని ప్రారంభింపబడిన మతపరివర్తన ఘోరము దీనికి చేదోడుగా నిలుచుచున్నది. కానిదింకను బాల్యావస్థ యందుండుటచే యరికట్టుటకు వీలు గలదనవచ్చును.

సమయానుకూలముగా మొలకెత్తుచున్న యీవిషవృక్షమును నిర్మూలించుటకు, దేశగౌరవము రక్షించుట కిట్టి సంఘమత్యవసరము. కాని ఊరి తెలివి గోడలే తెలుపుచుండును. కార్యనిర్వాహకార్థము సంఘమునందు కంకణము ధరించినవారి ప్రాశస్త్యము గమనించుచు సంఘధర్మము లెంతవరకు ఆచరణభాగ్యము బడసి ఫలవంతము లగునో నాకింత విశదపరచ వీలుగలదు. నేడు పరస్పర స్నేహము స్థిరీకరించుట కేర్పడిన యీసంఘమందలి సభ్యుల మనోనిశ్చితములు, ప్రవర్తనలుబట్టిచూడ నిదేదో యన్యోద్దేశ నిర్వహణార్థమేర్పడినటుల యనుమానమొకటి కలుగవచ్చును. మీరకబ్బరలీఖాన్ గారి ప్రకటన ననుసరించియీసంఘము స్థాపింపబడినదని తెలుపుచున్న "బులిటన్" వార్తయాయనుమానము కొంత వరకు సహేతుకమని నిర్ణయించవచ్చును.

ప్రభుత్వమువారి యాలోచనయందున్న శాసనసభావిస్తృతికి-తౌసీ-యె మజ్లిస్ వజె ఖవానీన్- నేడు రేపో తత్పూర్వకయాచరణభాగ్యము కలుగనున్నది. దేశమునం దిదివరకు సాదమిచని సాంఘికప్రాతినిధ్య పెనుభూతమునకు తావొకటి కలిగించదలచి, తదానుగుణ్యముగా ప్రజలమోహావేశ మొనర్చుటయే యాంతరకోద్దేశమైన యిట్టిసంఘములుగాని, ప్రజాహిత సేవకులమని బొగుడుకొనువారల కృషిగాని దేశమునకు అణుమాత్రమైన యవసరములేదని నొక్కి చెప్పగలము. మతపరివర్తనమే పరమావధిగా నిర్ణయించుకొనిన బహదూర్‌జంగువంటి వారలు సభ్యులుగలసంఘ మెన్నుకోదగిన కార్యములు సలుపునని యాశించుట భ్రమాపూరితమేమో!

విషయమంతయు సంధకారావృతమైయున్నను ప్రజాసేవయందు లీనమైయున్న శ్రీహనుమంతరావు పంతులు గారుండుటలో కొంతలోకొంత సేవయైనను జరుగవచ్చును. పంతులుగారిస్వభావమునుబట్టి వారునామకార్థసంఘములందు సభ్యులుగానుండుటకు సమ్మతించరు. ఒకవేళ అట్టిసంఘములు తమకు ప్రాముఖ్యత కలుగవలయునని యభిలషించి వారినిసభ్యులుగాయెన్నుకొన్నను తక్షణమే వారుండుటకు వీలులేదని పత్రికలద్వారా ప్రకటించుచుండిరి. ఇంతవరకట్టి ప్రకటనయేదియు ప్రకటింపబడనందున పంతులుగారు సభ్యత్వమునంగీకరించిరనుట నిశ్చయము.

దేశసౌభాగ్య మపేక్షించుచున్న పంతులుగారికి వివిధసంఘములమైకమత్యము, సమానప్రతిపత్తి, సమిష్టికార్యాచరణములనునవి నవీనములుగావు. ప్రజలయందజ్ఞానము వృద్ధిచేయుచు, విద్యాప్రచారమున కంతరాయము కలిగించుచున్న ఖాన్గీపాఠశాలలనిరోధకము, బహిరంగసభల నిషేధము, పత్రికాస్వాతంత్ర్యము మొదలగువానిని వెంటనే యంతమొందించుటకు కృషిసలుపుటముఖ్యము.

ఇంతేకాదు నేడురాజ్యమునందంతట జరుగుచున్న మతప్రచారమువలన హిందూ మహమ్మదీయులలో మతవైషమ్యములు, మనస్పర్థలు వృద్ధిగాంచుచున్నవని ప్రజలకు నిదర్శనపూర్వకముగా విశదపరచుచు యిట్టిహానికరములగు కార్యముల వెంటనే ప్రభుత్వసాయముతోనైనా నాపివేయించు టత్యవసరము. కాబట్టి ఉభయసంఘములవారు దేశసౌభాగ్యాపేక్షితులై, అల్పవిషయములకై ప్రాకులాడక మానవజన్మసత్వముల సాఫల్యతకు సమిష్టిరూపమున కృషిసలుపుటకు కంకణబద్ధులైన అనతికాలములో గోల్పోయిన ఆమహాగౌరవములభించుననుట నిశ్చయము. దీనివలన రాజ్యమునకు, ప్రభువునకు తగుసేవ సలిపిన వారగుదురు.

—

కీ. శే. పరచా సీతారామ చంద్రరావుగారు,

వరంగలుజిల్లాహరిజన సేవకసంఘాధ్యక్షులు, భారతయువజనసంఘసంస్థాపకులు గ్రంథాలయాభిమానులు, గ్రామపునరుద్ధరణదీక్షులగు శ్రీ పరచా రామచంద్రరావుగారు దుండగీయులచే హత్యగావింపబడిరని తెలుపుటకు దుఃఖించుచున్నాము.

అదేమి దురదృష్టమోగాని దేశాభ్యుదయమునకు మనోవాక్కాయకర్మలతో లీనమగు ప్రజాసేవకులను తరుచుగా యకాలమృత్యుదేవత తనకుక్షియందిమిడించుకొనుచున్నది. దీనివలన దేశమునకు తీరనినష్టము వాటిల్లుటయేగాక వారలచే ప్రారంభింపబడిన సదుద్యములంత వరకే నిలిచిపోవుట కానగును.

అజ్ఞానాంధవృతమైన యీనిజామాంధ్రావనిలో జ్ఞానోదయము కలిగించుటకు పరచా సీతారామచంద్రరావు గారు దీక్షాకంకణబద్ధులై కృషిసలుప మొదలిడిరి- వీరు మక్తెదారులైనను సామాన్యజీవితమలవరచుకొని జనసామాన్యమునకుండు కష్టనిష్ఠురములు తొలగించుటకు నిశ్చయించిన నిరాడంబరులు గ్రంథాలయోద్యమమునకు, హరిజనోద్ధరణమునకు జీవితమర్పించిన త్యాగమూర్తులు. ఖమ్మంమెట్టు ఆంధ్రమహాసభ సందర్భమున స్వచ్ఛందసేవాదళమునకు తగురీతిగా శిక్షగరపుటయేగాక, మహాసభను జయప్రదముగా నొనర్చుటకు రేయింబవలు నిద్రాహారములు వదలి కృషిసలిపిన ప్రజాసేవకులు.

ఇట్టిమహనీయునిచే ప్రారంభింపబడిన హరిజన గ్రంథాలయోద్యమముల కంతటితో తిలోదకములొదిలిన వారియాత్మకశాంతియే గాక ద్రోహమొనర్చినివారగుదుము. కాబట్టి జిల్లావాసులందరేకమై వారియందుండిన భక్తిగౌరవములకు క్రియారూపముకలిగించి అనగా వారిచే ప్రారంభింపబడిన సదుద్యమముల సాగునటుల కృషిసలిపి వారిఆత్మకు శాంతికలుగునటుల నొనర్చుట ధర్మము.

—

## తిరువాన్కూరు

## హైదరాబాదు ననుసరించుట

ప్రభుత్వమువారి బస్సుసర్వీసు

(ఒకవిలేఖరి)

తిరువాన్కూరు ప్రభుత్వమువారు రానున్న అగస్టునుండి ప్రారంభమగు మళయాళ సంవత్సరమునకు తయారుచేసిన ఆదాయవ్యయముల అంచనాపత్రములో ప్రభుత్వపక్షమున బస్సులను నడిపించుటకై ౫ లక్షలు చేర్చినారు. మన నిజాంరాష్ట్ర ప్రభుత్వమువారు ఈపద్ధతినవలంబించుటచే మొదటి రెండేండ్లలోనే నికరముగా నూటికి ౧౦ చొప్పునగలిగిన లాభమును జూచి ఈ ఈపద్ధతి అవలంబించదలచినారు. తిరువాన్కూరులో హైదరాబాదులోకన్న ప్రయాణికులయొక్కయు సరకులయొక్కయు రాకపోక లెక్కువగనుక నూటికి ౧౫ లాభము రావచ్చునని తలంచుచున్నారు. ఎట్లైనను నూటికి ౭౫ కంటె తక్కువలాభమురాదని నమ్మకము. మొదట త్రివేంద్రమునుండి కన్యాకుమారి అగ్రమువరకుపోవు రోడ్డుమీదమాత్రమే బస్సులను నడుపుదురు. ఈరోడ్డుపై నడచుబస్సులన్నియు ఒక్కనివే. తక్కినరోడ్లలో అనేకులు బస్సులు నడపుచున్నారు; పోటీచాల తీవ్రముగనున్నది. అరోడ్లపై ఖాన్గీబస్సులు నిషేధింపబడినచో కొద్దిబస్సులుమాత్రమేగల చిన్నయజమానులకు నష్టపరిహారము ను ప్రభుత్వమువారు ఈయవలసియుండును. ఖాన్గీబస్సులు నడవకుండచేయబడినప్పుడు ఇప్పుడా బస్సుసర్వీసులలో నౌకర్లుగల డ్రైవర్లు, టిక్కెట్ చెకర్లు, యంజినీర్లు మున్నగువారలకు నిరుద్యోగము సంభవించునని తలచవలదని దివాన్ సి.పి. రామస్వామయ్యరుగారు చెప్పుచు "మేము క్రొత్తనమూనా బస్సులను, లారీలను నడిపెదముగనుక, ఇంతవరకు పనిచేయుచున్నవారు వీటిలో పనిచేయుటకు క్రొత్తశిక్షణపొందుట అవసరమనుచున్నారు. మరియు ప్రభుత్వమువారు తమబస్సులను సాధ్యమైనంతవరకు ఇప్పుడుండు మరమ్మతుషాపులలోనే మరమ్మతుచేయించెదరు. ఈవిధముగా సంస్థానమందన్ని రోడ్లను క్రమక్రమముగ వశపరచుకొనెదరు.

ప్రస్తుతము ప్రభుత్వమువారు ౫౦ బస్సులను ౧౦ లారీలను కొనదలచినారు. దీనికి లక్ష రూపాయలగునట. ఈమోటారుబండ్లలో రెండుమూడుతప్ప తక్కినవాటిని పూర్తిబండ్లుగ తెప్పించక, యంత్రములమాత్రము తెప్పించి, తిరువాన్కూరు సంస్థానములోనే దొరకుచున్న వస్తువులతో తిరువాన్కూరు దేశీయుల కార్మికులతోపూర్తి మోటారుబండ్లు తయారు చేయదలచినారు. ఈనిర్మాణములో శాస్త్రపరిజ్ఞానము అవసరముగుచో అట్టిదానికి క్రొత్తగా స్థాపించదలచిన విశ్వవిద్యాపీఠములో శిక్షణయొసగు ఏర్పాటుచేసెదరు.

తిరువాన్కూరు దక్షిణోత్తర మధ్యభాగములో ఒక్కొక్క కేంద్రములో హీనజాతుల అభివృద్ధికి సౌకర్యముల నేర్పరచుటకును, అట్టి ఇతరకార్యములకును రూ ౫౦ వేలును, వైద్యశాలలులేనిచోట్ల కొన్నిలసమయమున సహాయమునకై ౫ వేలును ప్రభుత్వమువారు రాబోవుసంవత్సరమున వెచ్చించదలచినారు. ఈ మొత్తములన్నిటిని తిరువాన్కూరు శాసనసభా స్థాయిసంఘమువారు ఆమోదించిరి.

తిరువాన్కూరులో ౫౩ గురు సభ్యులుగల వ్యవసాయసంఘమొకటి యున్నది. ఇందు ౧౦ మంది శాసనసభలచే ఎన్నుకొనబడినవారు, ౫ గురు ప్రభుత్వముచే నామినేటు చేయబడినవారు, తక్కినవారందరు ప్రభుత్వవ్యవసాయశాఖోద్యోగులు ప్రభుత్వోద్యోగులు ప్రజాప్రతినిధులతోకలిసి ఆలోచనలుచేయుట వ్యవసాయాభివృద్ధికి ఎక్కువలాభకరము అనుభవముతో ఈసంఘము ఏర్పాటుచేయబడినది. అట్టి ఈసంఘముయొక్క రెండవసమావేశము ఈ జూలైనెల ౧౨ మరియు ౧౪ తేదులలో వ్యవసాయ శాఖాధ్యక్షునిక్రింద జరిగెను.

# భళీ! ఆంధ్రరాజకీయ ప్రతిష్ఠ!!

## ప్రకాశం సాంబమూర్తుల ప్రతిభ

"ఆంగీరసుడు"

"మదరాసు రాజకీయరంగములో సర్వసాధారణముగా ఆంధ్రులే నాయకత్వము వహించుచుందురు" అని యిదివరలో మద్రాసు శాసనసభాధ్యక్షతవహించిన సి.వి.ఎస్. నరసింహారాజుగారు (విశాఖపట్నం) వచించియుండిరి. ౧౯౨౦ సం॥రమునుండి తెలుగువారు (ఏ హాట్రీకొనిండు) మదరాసులో ప్రముఖత్వమును సంపాదించుచువచ్చిరి. తీవ్రసహాయనిరాకరణోద్యమము యున్న ౧౯౨౦,౩౦ అలోగాక యితరసమయములలో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుసంఘము ఏదో కాలక్షేపముచేయుసంస్థగా యుండెడిది. ౧౯౩౪లో ప్రకాశం సాంబమూర్తిగార్లు రాష్ట్రకాంగ్రెసు నాయకత్వముస్వీకరించినది మొదలు రాష్ట్రీయవ్యవహారములు చాలకట్టుదిట్టములతో వ్యవహరింపబడినవి. అనేక కారణములచొప్పున పలువురువారలతో ఏకీభవింపలేకపోవుగాక, మరికొందరు ప్రతిఘటించుగాక, ఏదియెట్లున్నను నేనిదివరలో చెప్పినట్లు ప్రకాశంసాంబమూర్తుల సమ్మేళనముతో మహత్తరశక్తి ప్రభవించెను. మహాత్మాగాంధికిని, వారి అంతరంగికులు పటేలు రాజేంద్రప్రసాదు మున్నగువారలకును ముఖ్యుడైన రాజగోపాలాచారిగారు యిదివరలో రాజకీయములనుండి విరమించినకారణము (మద్రాసులో డా॥ మల్లయ్యగారి ఖాళీఎన్నికలో?) ప్రకాశంసాంబమూర్తులేనని చెన్నపట్టణములో విచ్చలవిడిగా చెప్పుకొనిరి



ప్రకాశంసాంబమూర్తులు నిరంకుశులు. ఆవేశపరులు. పట్టుదలవీడనివారు. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుసంఘ కార్యాలయము మద్రాసుకు వీరు తీసికొనిపోగానే రాజగోపాలాచారి సత్యమూర్తిగార్లు భయపడి మద్రాసునగరములో ఆంధ్రులకుచోటులేదనిరి. దానితో ప్రకాశంసాంబమూర్తులు రోషావేశులై కాంగ్రెసు కార్యసంఘములోపోరాడి మద్రాసును తెలుగువారికి విలుపగలిగిరి. మదరాసుకువెనుక సైమనుకమిటీవచ్చినతరి చెన్నపురిప్రతిష్ఠను కాపాడినవారు ఆంధ్రులే—ముఖ్యముగ ప్రకాశంసాంబమూర్తులే. ఆసందర్భములో తొలుత అరస్టయినవారు సాంబమూర్తిగారు. అప్పుడే కాదు గవర్నమెంటువారు నిర్బంధములను ప్రారంభించినతరి సాధారణముగ ఆంధ్రరాష్ట్రములో ప్రథమ శ్రీముఖము సాంబమూర్తిగారికే వచ్చెడిది. ౧౯౨౦నుండి ౩౭వరకు పదిహేనుసంవత్సరములు వీరు ప్రత్యక్షాధిపత్యముగ తూర్పుగోదావరిజిల్లా కాంగ్రెసు అధ్యక్షులుగానుండినవారు సాంబమూర్తిగారు. ఈవిధముగ ఏజిల్లాలోను ఏనాయకుడు వరుసగాంబడిని అంతకాలము మండల నాయకత్వము వహించియుండలేదు. ఇంక రాష్ట్రకాంగ్రెసుసంఘములోకూడ ౧౯౩౪ కు పూర్వం సాంబమూర్తికి పలుకుబడి మిగతనాయకులకన్న హెచ్చుగనేయుండెడిది. ౧౯౩౧ గుంటూరు రాష్ట్రీయసభలో అల్లూరి శ్రీరామరాజు తీర్మానముమీద సాంబమూర్తిగారిచ్చిన మహోపన్యాసమును మరువలేము. పెద్దలందరు పట్టాభిగారి సవరణను సమర్థించిననూ, యువకులు వీరపాంబునిపక్షమునకేరి తీర్మానమును నెగ్గించిరి. సాంబమూర్తిగారు ఆంధ్రరాష్ట్రీయసభకు, రాష్ట్రీయ కాంగ్రెసుసంఘమునకు అధ్యక్షులై యుండిరి. భారత కార్యసంఘసభ్యులుగా నుండిరి. హిందూస్థానీ సేవాదళాధ్యక్షులైరి. బంగారవాంటేసభ కధ్యక్షతవహించిరి.

### భారత నాయకులలో లాఠీదెబ్బలకు గురియైనవారు వీరే!

సంపూర్ణ స్వాతంత్ర్యాదర్శమునుగురించి పదిసంవత్సరములకుపైగా భారతావనిలో ప్రతిసభలోను తీర్మానము తెచ్చి వాలోరాహోరిని పో

రాడిన ప్రజ్ఞాశాలి సాంబమూర్తి. తనఏకైక పుత్రునికోల్పోయినరోజులలో కాకినాడ కాంగ్రెసు వ్యవహారములను చిదానందముతో నడిపించిన ధీరోదాత్తుడు శ్రీపార్థివసంవత్సర మాఘబహుళ ౧౩ శ మహాశివరాత్రినాడు లింగోద్భవకాలమున జన్మించగా వేదములో జగత్ప్రండితుడగుతండ్రి సుబ్బావధానులుగారువీరికి సాంబమూర్తియని నామమిడిరి. అట్టిమహాపురుషులు గౌరవనీయులగు బులుసు సాంబమూర్తిగారు ఆంధ్రప్రతిష్ఠనునిలుపుచు నేడుమద్రాసు శాసనసభా సింహాసనమునధిష్ఠించిరి.



గా॥ సాంబమూర్తిగారికన్న గౌరవనీయులగు టంగుటూరిప్రకాశం పంతులు మితవాది. కాని ఆత్యవసరసమయమునకు సింహగర్జనచేసి మహాకార్యములను నిర్వహింపగల ప్రతిభాశాలి. ఈఆంధ్రకేసరి తనయొద్యమమును ఆంధ్రరాష్ట్రమంతటిలోను ప్రచారముచేసెను. ప్రత్యేకము ఒకజిల్లా తనదియనిలేదు. కేరళములో హిందూమహమ్మదీయ కొట్లాటలు చెలరేగినవి పడసితిలో ప్రకాశంపంతులు మిట్టపాళయములోని కతిథైర్యముతో జోయెను. తర్వాత ప్రథమకేరళ రాష్ట్రీయకాంగ్రెసు మహాసభకధ్యక్షతవహించెను. రమారమి పదిలక్షలు ప్రోగుచేసి ఆంధ్రులకు "స్వరాజ్య" ఆంగ్లదినపత్రికనుసంపాదించెను. కాని అనేకకారణములవలన అది నిలబడలేదు. నెలకేడెనిమిదివేల రూప్యముల ప్రాక్టీసునువదలుకొన్న మహాత్యాగి. ప్రకాశం పంతులను చూచుటకుగాని ఆతడితో మాట్లాడుటకుగాని అందరికిష్టయమే.

అంతఃకరణలో ఆయనచాలసౌమ్యుడు. వీరు భారతకాంగ్రెసుసంఘ కార్యదర్శిగా కొంతకాలముయుండిరి. వీరునేడు మద్రాసుప్రభుత్వ రెవెన్యూశాఖామంత్రిస్థానము నలంకరించుచున్నారు. అసలుమొదట్లోయున్న పరిస్థితులప్రకారము [ఎన్నికలకుపూర్వము] ఆంధ్రకేసరియే శాసనసభానాయకుడై ప్రధానమంత్రి కావలెనని యుండెడిదని వాడుక. తమిళులు సత్యమూర్తిగారినికాని నాయచానినిచో డాక్టరుసుబ్బరాయనుగారిని కాని ప్రధానమంత్రిగాచేయ నుద్దేశించిరటకాని నాయకులు ప్రకాశంగారి ముందుఅగలేరని రాజకీయములనుండి విరమించిన శ్రీ త్రిచియకాంగ్రెసువాది చక్రవర్తి రాజగోపాలాచారిగారిని శాసనసభారంగములోనికి దించిరని ప్రతీతి.



గా॥ వరహాగిరి వెంకటగిరిగారు (బార్-ఎట్-లా) సుప్రసిద్ధ దేశభక్తుడు. ౧౯౨౦లో కాంగ్రెసులోచేరి నాలుగైదువత్సరములు ఆంధ్రరాష్ట్రకాంగ్రెసు కార్యదర్శిగానుండిరి. తర్వాత రైల్వేపనివారల ఉద్యమములోనికివెళ్లి అఖిలభారత రైల్వేపనివారల సంఘమునకు శాశ్వతకార్యదర్శియైరి. గిరిగారు స్వప్రజ్ఞవలననే యీయుద్యమము నతిసమర్థతతో నడుపుచు అఖిలభారత నాయకుడయ్యెను. ఆంధ్రదేశములో నాయకత్వము సంపాదించుకొనుటకష్టమే, దానిని సగౌరవముగ నిలుపుకొనుటకష్టమేయైననూ గిరిగారు చతురతతో ఖ్యాతినినిలుపుకొనుచున్నాడు. రెండవప్రేడు యూనియన్ కాంగ్రెసుకు యీయన అధ్యక్షుడౌట గొప్పసంగతి. అనేకసారులు భారతశాసనసభలో లేబరుప్రాతినిధ్యముకొరకు నియామకముచేసెదమని గవర్నమెంటుయడుగగా తనకు నామినేషనులలో నమ్మకములేదని వారికోరికను తృణీకరించెను.

ఆటులనే ప్రథమరౌండు టేబిలు కాన్ఫరెన్సుకు గిరిగారిని నామినేటుచేసెదమనగా కాంగ్రెసు అందుపాల్గొనుటకు సిద్ధముగలేదని నిరాకరించెను. రెండవసారిగాంధిగారు ఇష్టమందగా తానుకూడ ప్రభుత్వకోర్కెను అంగీకరించి లండనువెళ్ళెను. గిరిగారు నిష్కళంకరాజకీయవేత్త. ముక్కుసూటిగాపోవు న్యాయశీలుడు. ఏరైల్వేసమ్మెనైననూ అతి సమర్థతతోను శాంతముతోను నిర్వహింపగల ప్రజ్ఞావంతుడు. మోతీలాలునెహ్రూకు జవహర్లాలుకలిగినట్లు ఆంధ్రమహాసభాధ్యక్షుడు వరహాగిరివెంకటజోగయ్యపంతులుగారి పుత్రరత్న ప్రఖ్యాతవంతుడయ్యెను. మొన్నటి అస్సెంబ్లీఎన్నికలలో బొబ్బిలిరాజానోడించినమొనగాడు. ఇట్టి గౌరవనీయులగు గిరిగారు లేబరుమంత్రిగా ఏర్పడినారు.

స్థానిక స్వపరిపాలనశాఖామంత్రి గౌరవనీయుడగు బెజవాడ గోపాలరెడ్డిగారు అతి పిన్నవయస్కుడు. నెల్లూరుజిల్లా బుచ్చిరెడ్డిపాలెంలో మహాఐశ్వర్యకుటుంబములో జన్మించెను. పట్టభద్రుడు. విద్యచాలించినది మొదలు కాంగ్రెసులోచేరి కారాగారములకేగి శ్రమలపొందినాడు. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుసంఘ కార్యదర్శిగాపనిచేసెను. చక్కటి ఉపన్యాసకుడు. బహుశాంతుడు. మద్రాసుమంత్రులందరిలోను చిన్నవాడు.



గా॥ రుక్మిణీలక్ష్మీపతిగారు అస్సెంబ్లీ ఉపాధ్యక్షురాలుగా ఎన్నుకొంబడినది. సుప్రసిద్ధులగు డాక్టరు అచంటలక్ష్మీపతిగారిభార్య యీమె. ఆంగ్లవిద్య నభ్యసించుటచేత రాజకీయములలో ప్రసిద్ధిగాంచెను. ఈమెకు రాజగోపాలాచారిగారు ఎక్కువగా ప్రాముఖ్యతనిచ్చి పైకితెచ్చిరి.



కె. వెంకటస్వామినాయుడుగారు కౌన్సిలుకు అధ్యక్షులైరి. మొత్తముమీద ఆంధ్రులకు మూడుమంత్రిత్వములు, ఒక శాసనసభాధ్యక్షత, రెండు ఉపాధ్యక్షత్వములు ప్రాప్తించినవి. తమిళులలో అరుమంత్రిత్వములు ప్రధానమంత్రిత్వము గా॥ రాజగోపాలాచారిగారిది మరియు గౌరవనీయులు డాక్టరుసుబ్బరాయన్ ఎస్. రామనాథన్, వి.ఐ.మునుస్వామిపిళ్లె [హరిజన], డాక్టరు టి.ఎస్.ఎస్. రాజన్ గార్లు. గా॥ యాకూబుహుస్సేను గారు కడపవాడనియు ఆంధ్రుడనియు ప్రతీతి. కాని మద్రాసులోనేయుండి తమిళులతోనే కలసిమెలసియుంటూయున్నారు. కేరళీయులతరపున గా॥ కె. రామునిమేనన్ గారు మంత్రిగానున్నారు. కర్నాటకులకు గా॥ డాక్టరు యు. రామారావుగారు కౌన్సిలుఅధ్యక్షులైనారు. మంత్రులసంఖ్యపదియైనది. [illegible] లో చేరవలసియుండి [illegible] మూర్తిగారు వీరు చిరకాలము [illegible] "ఆంధ్రపర్గములో"యని ఆందోళన [illegible] నూ వారికి ప్రాప్తించలేదు. అయ్యదేవర కాళేశ్వరరావు [బెజవాడ] గారికి లభించలేదు. ప్రధానమంత్రివద్ద కార్యదర్శిత్వముమాత్రము దొరకినది— తెన్నేటివిశ్వనాథం— మాగంటి బాపినీడు, బయ్యా సూర్యనారాయణమూర్తి గార్లు కార్యదర్శులైరి— కట్టమంచి రామలింగారెడ్డిగారికి విధిగా యీసందర్భములో వచ్చియుండెడిదేకాని ఆయన నిలకడలేనితనమే పాడుచేసినది— తమిళులవ్యూహము లెట్లున్ననూ ఆంధ్రరాజకీయ ప్రతిష్ఠనిలచినదోయన్నట్లు తెలుగువారికి పదవులుసరిగానే లభించినవి— స్వల్పభేదాలు గణింపదగినవికావు—

ఆంధ్రప్రతిష్ఠకానిండు తమిళప్రతిష్ఠ కానిండు—అది కాంగ్రెసుప్రతిష్ఠ. కాంగ్రెసు విజయముయగుట భారతీయులకు ముఖ్యముగాకావలసినది— సమర్థులైన రాజగోపాలాచారిగారి నాయకత్వమును కాంగ్రెసు మంత్రివర్గమునకు జయమగుగాక!



## మా చందాదారులకు

తమ ఉత్తర ప్రత్యుత్తరములలో చందా నంబరు తెలుపవలెను. లేదేని జవాబు ఇవ్వబడదు. తమ లేఖలు మేనేజరు పేర వ్రాయవలెను.

నో:— చందానంబరు తమ తమ పంపుపత్రిక పైన వుండును.

# వింతలు విశేషములు

## రత్నములు రువ్వుట

వస్తువులవిలువ దానిఅవసరముపై ఆధారపడి యుండుచుండును. దక్షిణఅమెరికా యందలి ప్రాచీన ఇంకాఇండియనులవద్ద విరివిగా బంగారముండెడిది. స్పెయిన్ దేశస్థులా ప్రదేశము జయించునంతవరకా దేశీయులకు బంగారపువిలువ దెలియక దానితో వారు మొలికలు మొదలగుపనిముట్లు, యిత్తడి యినుము మాదిరిగ నే చేసుకొనుచుండిరి, స్పైన్ దేశస్థులయవసరము వారి బంగారమునకు విలువకలిగించెను. ఇంతేగాక ప్లాటినమనుధాతువు విరివిగా వారిప్రాంతము అందులభించుచుండినను దానికేమాత్రమువిలువ లేకుండెడిది. దక్షిణాఫ్రికా ప్రజలు శ్వేతజాతివారు వచ్చి వానివిలువ అవసరములుకల్పించువరకు రత్నములరువ్వి పిట్టలగొట్టుచుండిరి. వేయేల ప్రజలఅవసరములే వస్తువులవిలువకాధారమనుట నిశ్చయము.

---

## మాంసాహారము

### ధైర్యసాహసములు, బలముకలిగించునా?

నేడు యువకులందు ధైర్యసాహసములు సన్నగిల్లుచుండుటకు మాంసాహారమే ప్రబలకారణమా? యను విషయమొకమహాసభ (లండన్ నగరమునందు) చర్చనీయాంశముగానుండెను. విషయమును ప్రతిపాదించినవారు ప్రొఫెసరు ఇ.పి. క్యాథ్ కార్ట్ వీరు గ్లాస్గోవిశ్వవిద్యాలయమందలి శారీరకశాస్త్రపండితులు.

ఇంగ్లాండ అమెరికా దేశములందు నానాటికి యువకులాహారమునందు మాంసమందలి బలవర్ధకభాగము తగ్గుచుండుటచే వారియందధైర్యము, వీరికిలేనమున్న ప్రబలమున్నదని ప్రొఫెసరుగారిఅభిప్రాయము.

శరీరమునకుబలముకలిగించునది ధైర్యసాహసములు పుంజీవభవింపజేయువదిఫలములు, మధుర పదార్థములుగాని పక్వగోమాంసము, గొఱ్ఱె మాంసము ముమ్మాటికిగాజాలదని "శక్తిగాలదిభుజించు" భోజనశాలాధికారినుడివెను.

"సింహముమాదిరి బలముకలిగి ధైర్యసాహసములందు సమానుడవుగా నుండగోరిన సింహమువలెభుజించుము. గోవుమాదిరి నిరపాయముగానుండగోరిన సాత్వికాహారముభుజించు

## అకస్మాత్తుగ ఆకసమున కెగిరినపిల్ల

కంగా, జూన్ ౨౮

కజ్ గ్రోటీ గ్రామస్థులు ౨౦౫ మందికిపైగా ఇండ్లవెలుపలనిద్రించుచుండ, అర్ధరాత్రివేళ ఛోటు అను పేరుగల స్త్రీ ఉలికిపడిలేచి తనపిల్లను ఎవరో ఎత్తుకపోయినారని కేకపెట్టెను. నిద్రించుచున్న వారలందరును లేచి ఇటునటుచూడ పిల్ల గాలిలో నెగిరిపోవుచున్నట్లు కనిపించెను. పిల్లతోకూడ దీపముమాత్రమేయుండెను. ఊరివారలందరును ౩౦౦ గజములవరకు దీపముజాడననుసరించిరి. దీపమారిపోయి, పిల్లక్రిందపడి మరణించెను. పిల్లతల్లికి పిచ్చెత్తెను.

---

## విచిత్ర తర్కము

### జుర్మానాల చెల్లించుటకు పనియా?

నేటికి ౨౧ రోజులక్రింద టిక్కట్టులేకుండప్రయాణముచేసినందుకు లాహోరు రైల్వేస్టేషనులో ఒకరష్యాయువకుని పోలీసులు పట్టుకొనిరి. అతనికి న్యాయాధికారి రైల్వేశాసనము ప్రకారము ౫౦ రూపాయలజుర్మానా, ౨ నెలలఖైదు విధించెను. ఆయువకుడు జుర్మానా చెల్లించుటకు తానిష్టపడుచున్నను తనవద్దడబ్బు లేదనియు, కనుక తనను అడబ్బుసంపాదించుటకై తనకేదేని పనినిప్పించి అపనిచేయనిచ్చుకొననలసినదనియు న్యాయాధికారిని వేడుకొనెను. మాస్కోకు [రష్యాపట్టణము] పంపినపో మొదవాయని అతనివడుగ అతడు భారతదేశములో నేనుండగోరెదననెను.

---

మ॥ని గతశతాబ్దమునందొక పోలెండు డాక్టరు స్వదేశీయులకుబోధించెనట!

"మనము,మనసామ్రాజ్యము మాంసముమద్యముతో జయించగలిగితిమి. నేడు వానినివిసర్జించుటభావ్యమా? సామ్రాజ్యమును మనలను అంతమొందించుటకు మీరుబూనుకొనెదరా" ని ప్రొఫెసరు సభికులవులకరించెను.

---

## ప్రకృతిచిత్రము

### ౧౬ మాసములపిల్ల గర్భము ధరించుట

### ఆపరేషన్ తో పిండముదీయుట

బర్బగాస్టోబీయను నొక ౧౬ మాసముల పిల్ల ప్రసవించినది.

స్టోబీయనుపిల్ల పుట్టినప్పు డారోగ్యవంతముగానుండెను. కాని కొన్నిమాసములకు పొత్తికడుపుపెరిగి గర్భవతిగా గోచరించ మొదలయ్యెను.

ఓర్లాంవ్ (అమెరికా) విశ్వవిద్యాలయమునకు సంబంధముగల వైద్యాలయమునకాపిల్లను తలిదండ్రులు తీసుకవెళ్లి వైద్యులకుచూపిరి. ఆ పిల్లయొక్కపొత్తికడుపు, క్రిందిభాగముల యెక్స్ రేఫోటోతీయగా పిల్ల గర్భవతిగానున్నటుల తెలకొను. వెన్నెముక, చేతులు పిండమునందేర్పడినటుల ఫోటోవలన తెలియవచ్చెను.

కడుపుపైభాగమునందు వైద్యులు ఆపరేషను చేసి గర్భమునుండి ౫ మాసముల పిండమునూడదీసిరి.

పిండమునందు మొగశిశువుండెను, ఎత్తునందేవంగుళములను ముఖముమాత్రమింకను పూర్తిగాకుండెను. కుడిపాదమునకాయవేళ్లు,యెడమపాదమునకు నాలుగు,వానియందు గోళ్లచిహ్నములుండెను.

ఈపిల్లతల్లి గర్భవతిగానుండుకాలమున యొక అండము పిల్లయొక్కగర్భమున ప్రవేశించిక్రమముగా అభివృద్ధిగాంచి యీరూపము ధరించియుండునని యీవిచిత్రమునకు శాస్త్రజ్ఞులు ఆధారములకల్పించుచున్నారు.

---

# 'జగదేకమల్ల' గామాగారి సంచారరహస్యము

జగదేకమల్లుడని అంగీకరించబడిన గామాగారు ఇపుడు భారతదేశ మంతటను సంచారము చేయుచు తమసామర్థ్యప్రదర్శనముల జేయుచున్నారు. వీరికి ప్రతిచోట ఉత్సాహపూరితములగు సన్మానములు జరుగుచున్నవి. ఆంధ్రదేశమందలివ్యాయామశాల లన్నిటికిగామాగారిని నాహ్వానించివారిసామర్థ్యమునుచూచిఆనందించుటకు ఏర్పాట్లుచేయబడుచున్నవి.త్వరలో గామాగారు హైదరాబాదుసంస్థానమునకు గూడ రానున్నారు. ఇట్లు భారతదేశసంచారము ముగిసినతర్వాత గామాగారు యూరోపు, అమెరికా మున్నగు ఖండాంతరములకు, జపాను మున్నగు దేశాంతరములకు పోనున్నారు. వీరి ఈసంచార రహస్యమేమో?

గామాగారీసంచారమునకు బయలుదేరుటకు ముందేఎక్కడైనను ఎవరైనను తమతోపోటీచేసి నోడించ సంసిద్ధుడగువారు నున్నచో రావలసినదని సవాలుచేసినారు. ఇంతవరకు వారిని జగదేకమల్లుడనిపొగడుచు, వారిసామర్థ్యప్రదర్శనములుచూచి, ధనాదికసన్మానములచేయువారలేగాని, వారితోపోటీచేసి ఓడించెదమని ముందుకువచ్చినవా రెవరును కనపడుటలేదు. గామాగారి ఈ సవాలు నేటి సంచార రహస్యమును సూచనగా తెలియబరచుచున్నది. వారిక ఈ కుస్తీ రంగము నుండి నిష్క్రమించి విశ్రాంతిగైకొన నిశ్చయించినట్లు అనేకవార్తలవలన వెలియుచున్నట్లు హిందూస్థాన్ టైమ్సు పత్రికలో హెచ్.యస్. పీటర్స్ అనువారు ఒకవ్యాసములో వ్రాసియున్నారు. గామాగారికిపుడు ౫౨ఏండ్లు.నిష్క్రమించదగిన వయస్సే.అయినను వారిశ్శరీరపటుత్వమును, శక్తిసామర్థ్యములను బట్టిచూడ వారింక, నీరంగములోమండదగిన స్థితిలో ఉన్నారనిపించుచుండును. రంగము నుండి నిష్క్రమించుటకు ముందు ఈసంచారముయొక్క అవసరమేమి?

మల్లవిశారదుల రంగ నిష్క్రమణము కొన్నిలక్షలతో నెరవేరు పని- గామాగారితో ఇంతవరకు చాల కొద్దిమందియే పోటీ చేసియున్నారు. నిష్క్రమించుటలోపల ఒకసారి ప్రపంచమందలి మల్లులనందరిని సవాలుచేసి సవాలు నంగీకరించి వచ్చువారెవరైనను న్నారో అతనికి జవాబీయవలెను-అజవాబులో ఎదిరినిఓడించినచో మహాగౌరవముగా నిష్క్రమించవచ్చును- ఇందుకుగాను అన్నిదేశములనుండి రాదలచిన మల్లవిశారదులకు ఖర్చులన్నియు ఇవ్వవలసియుండును. గామాగారు ఇప్పటి దతియాసంస్థానప్రభువుగారి తండ్రిపోషణక్రింద మల్లరంగమున ప్రవేశించి ఖ్యాతిగాంచిరి-కొబట్టి గామాగారు ఆ ప్రభువుగారినే "తనలంగోటీ" తీసివేయుటకు అనుజ్ఞకోరిరి-దీనికి ఆప్రభువుగారు అంగీకరించలేదు-అందుచే గామాగారు తానే ప్రపంచమందన్నిప్రాంతములకు మల్లవిశారదు లుండుచోట్లకుపోయి వారలను సవాలుకు రమ్మనుచున్నారు-ఈసంచారమునకగు ఖర్చును ఇదివరకు వారిఖ్యాతికితోడ్పడిన పాటియాలా మహారాజుగారు భరించుచున్నారు-

గామాగారిలోనుండు విశేషమేమనగా, ఇంతవరకు వారు ఒకసారిగూడ పరాజయ మనుభవించలేదు-ఒక రహీంసుల్తాన్ గారిని ఓడించుటకుముందు మూడుసారులు పట్టుపట్టవలసివచ్చెను-మొదటిపట్టు గామాగారి ౧౯వఏట జరిగెను-మూడుసార్లును గామాగారు అతని నోడించి "రుస్తుమెహిందు"అనుబిరుదుబడసిరి

౧౯౧౦లో గామాగారు తమసోదరుడగు ఇమాంబక్షుగారితోకలిసి యూరోపా ఖండమంతయు సంచారము చేసి ఒక్కనెలలో ౨౦౦మంది మల్లవిశారదులనోడించిరి- అట్లోడించబడినవారలలో మహాప్రసిద్ధుడగు జిబెస్కో-తో మూడుగంటలపోటీజరిగెను- మరల పోటీనిసాగించుటకు జిబెస్కో-రాకపోగా గామాగారు "జగదేకమల్లు" వనుపించుకొనిరి-



తర్వాత గామా భారతదేశమునకు వచ్చెను; జిబెస్కో-అమెరికాకుపోయి డాక్టరు రోలరు, మామూద్ మున్నగు అనేకులనోడించి తుదకు మాలో ఓడెను- తర్వాత అరుసంవత్సరములకు జిబెస్కో-భారతదేశమునకువచ్చి పాటియాలలో గామానుసవాలుచేసి,ఈసారి మొదటిదెబ్బలోనేపడెను- పట్టు ప్రారంభ మెప్పుడైనది: ముగింపువకెప్పుడువచ్చినది జనులు గమనించుటకుగూడ అవకాశములేనంత కొద్దికాలములో జిబెస్కో-పడిపోయెను-జిబెస్కో-గారిని మెచ్చుకొనువారలు అంతర్జాతీయ సాంప్రదాయ ప్రకారము మూడుపట్లకవకాశమిచ్చిన న్యాయముగానుండెడిదని చెప్పసాగిరి.కాని జిబెస్కో-మాత్రము "గామా, ప్రపంచములో నెనుపోటీ చేసినవారలలోకెల్ల చాలగొప్పవాడు" అని చెప్పెను-

ఇపుడు గామాతర్వాత భారత దేశములో అంతటివాడెవడున్నాడుఅనిశంకించి హెచ్-యస్-పేటర్సుగారు హిందూస్థాన్ టైమ్సులో గామాగారిసోదరుడు ఇమాంబక్షు అని వ్రాసినాడు-కాని గామాగారు మాత్రము ఇటీవల ఒక సియాల్కోట వాసియగు గంగాఅను నొకముసల్మానుని పేర్కొనెను- అతడు చెవిటి, మూగవాడు యుండియు అందరినిమించిన మల్లవిశారదుడగుటయేగాక, మల్లవిశారదులందరిలోను గొప్పధనవంతుడట-అతడు త్వరలో కొల్హాపూరులో ఇమాంబక్షుతో కలియగలడు-తర్వాత ఈశ్వరుసింగుకూడ అసాధ్యుడేనని గామాగారన్నారు-

## మంచిసౌకర్యము త్వరపడుడు

మావద్ద తెలుగు, ఇంగ్లీషు, ఉరుదు స్కూలుపుస్తకములు, ఆంధ్రగ్రంధములు, నవలలు, నాటకములు కావ్యములు, యక్సర్ సైజు నోటుబుక్కులు, స్టేషనరీసామానులు వగయిరా సరసమయినధరలకు దొరకును.

**ఆంధ్రశ్రీకంపెని**

నెం. ౪౦౦ సుల్తానుబజారు

హైదరాబాదు-దక్కన్.

# పరిశీలనతో చిత్తగింపుడు

**1936—37** సంవత్సర ఫలితములు (12 నెలలు 1-4-36—31-3-37)

సర్వతోముఖమగు అభివృద్ధిని సూచించుచు చాల సంతృప్తికరముగనున్నవి

| | |
|---|---|
| క్రొత్తవ్యాపారము | రు 33 లక్షలు |
| భీమానిధి | $15\frac{3}{4}$ " |
| పాలసీనా ఆదాయము | $6\frac{1}{4}$ " |

1935లో

| | |
|---|---|
| క్రొత్త వ్యాపారము | 27 లక్షలు |
| భీమానిధి | 12 " |
| పాలసీనా ఆదాయము | 5 " |

ఇంకను జయప్రదమగు భవిష్యత్తును కెదురుచూచుచు,
ఇంకను అత్యధికమగు ప్రజామోదమును, విశ్వాసమును
బడయుటకు మీయెల్లర తోడ్పాటు నర్థించుచున్నది.

## ఆంధ్ర ఇన్షూరెన్సు కంపెనీ, (లిమిటెడ్)

మచిలీపట్టణము గా. జగన్నాధం

నిజాంరాష్ట్రమునకు చీఫుఏజంటు

## అపరాధం

[౧౦వ పేజి తరువాయి]

న్నది. "నేనూ మంచి బీడాలు తెచ్చినాను గా— ఇదో ఇదినీవు వేసుకో" అంటూ వెంకట్రావు ఆమెనోటికందించినాడు.

ఇట్లా పరసాలతో ప్రారంభమై వారు ఆనందంలో తన్మయులైపోయినారు. సమీపంలోనుండే పెద్దబంగ్లానుండి ఒకటీ—రెండూ— అంటూ ౧౨—గంటలు కొట్టినాయి.........

* * * *

"రాంకుమారీ! నీసహవాసంలో ఈదినం పొందిన ఆనందం ఎన్నడూ నాకు లభించలేదుసుమా. నాదొకకోరికవున్నది. అదితీర్చవూ" "ఏమిటో! సెలవియ్యండి చూస్తాం"

"ఏమీలేదు నీవు తెనుగుదేశంస్త్రీగా కనబడుతున్నావు. మంచిఖాన్దానీ లక్షణాలు కనపడుతూవున్నవి నీవద్ద. నీచరిత్రయేమో కొంచెము చెప్పరాదూ విందాము"

ఈమాటలువినేవరకు రాంకుమారీలో అకస్మాత్తుగా మార్పుకనబడింది. ఆనందమంతా మటుమాయమైంది. రెండునిముషాలు ఏదోవిచారంలో మునిగిపోయింది. కండ్లలోగిర్రున నీళ్లు తిరిగినై.

"ఏం! రాంకుమారీ! ఏం! నీకేంకష్టంవుంది. చెప్పు! నన్ను నీఆప్తున్నిగా భావించుకో. నీకిదివరలో ఎవ్వరూదిక్కులేకుంటే ఇదిగో నేనున్నాను ప్రమాణంచేస్తానమ్మా, విచారపడవద్దు."

"ఏంచెప్పుదునండీ నాకథ. అది ఒకచిన్న భారతంగావుంది. మీరున్నూ మాదేశంవారే కావున మిమ్మలను చూచినప్పటినుంచీ ఆదే మోనాకూ మీపైన ప్రీతికలిగింది. నాకథ ముక్తసరుగా చెస్తానువినండి—"

"నాది కరీంనగరుజిల్లా. గ్రామంపేరెందుకులెండి. ఏదోయిక్కే అజ్ఞాతవాసంలో యీ నీచవృత్తిలోనే చావనీయండి. మాతల్లిదండ్రులు మంచివైదికనిష్టగల బ్రాహ్మలు. నాకు యిద్దరన్నదమ్ములున్నారు, నాపెండ్లి నా యెనిమిదో సంవత్సరమే జరిగింది. నామొగుని ఊరుకూడ కరీంనగరుజిల్లాలోనేవుంది. వాండ్ల సంసారం బాగాజరుగుతూవుండేది. చుట్టూ ౫—౬ గ్రామాల పౌరోహిత్యం నామొగునియింటివాండ్లకు. నేను కాపరానికి ౧౩వ ఏట భర్తయింటికివెళ్లితిని. నాభర్తకూడ నన్నుబాగా ప్రేమించేవారు. అత్తమామలుకూడ చాల మంచివారు. ఏదో అనుభవించాలనిపిల్లఅని నన్నంతగాకష్టపెట్టకుండా చిల్లరపనులు చేయించుతూ సంసారంనడుపుతూ వుండేవారు. ఇట్లారెండేండ్లు కాపురంచేస్తూవచ్చినాను. మామామకు కొన్నాళ్లు చాలా జబ్బుచేయడంచేత ౪ మైళ్లదూరములోవుండే తాలూకా ఆస్పత్రిలోచేర్చి చికిత్స చేయిస్తూవచ్చినారు. ఒకనాడు ఆయన్ని చూడ్డానికని నాభర్త మాఅత్త వెళ్లినారు. నేనొక్కతెనే యింట్లోవుండిపోయినాను. ఆనాడు సాయంత్రం సుమారు ౭ గంటల కాలంలో మాయింటియెదుటవుండే "ఖాసిం" అనేవాడు ఒకబండిలోవచ్చి,

"అమ్మా మీమామకీ యెక్కువతక్కువ అయింది, బైటికిపట్టేనార్ మీదీమొగుడూ మీకీతచ్చనం తీస్కోరమ్మన్నారు రాండీ జల్దీజల్దీ రాండీ." అన్నాడు. నేనున్నూ దుఃఖిస్తూ యిల్లువాకిలిక్రమముచేసి, తాళంవేసుకోని బండిలో యెక్కినాను. రెండుగంటలకుపైగా బండి వేగానే నడిచింది.

గం"ఏమిసాయెబూ యింకా అస్పత్రి రాలేదేమి?"

"వస్తుంది, వస్తుంది దగ్గరకేవచ్చినాము".

"౪ మైళ్లేగా! యింతసేపా? యెక్కడికి పోతున్నానోయేమో"

"ఏంభయపడవద్దు. నీహవాసీకి నాహానం యిస్తాను. ఊఁ."

కొంతసేపటికి ఒకగ్రామంలో ప్రవేశించి ఊరిబయట ఒకయింట్లోకి తీసికొనిపోయినారు

"మామాశ్శెక్కడసాయెబూ" అంటే కిలకిలనవ్వి,

"అరే అపవ్వాచారుబాబమ్మతో యేంచేస్తావ్. నీకీ మేంబాగాగాలేపేం చెప్పు నీవే చెప్పుతే" అని తమాషాలుచేయబట్టినాడు. శరీరమంతా చెమటలు పోసినవి. నోరెండుకొనిపోయింది, మరియిద్దరు దుర్మార్గులులోపలప్రవేశించిరి. ఒకపిస్తలు నాపైగురిపెట్టి యేమన్నాగడబిడచేస్తివా నీప్రాణం తీసుకుంటాం అని బెదిరించిరి. తర్వాత అనుగ్గురుబలవన్తమునంచేసిరి..... నాగ్రహచారం ఇట్లావుంది. యెవరేమిచేస్తారు?

"అయ్యో! పాపం.... ఎంత ఘోరం యెంతఘోరం!" అని వెంకట్రావు అన్నాడు.

"అదే నాగ్రహచారానికి ప్రారంభం. వాండ్లు నన్ను నిర్బంధములో చాలాదినాలువుంచినారు. ఊరూరు తిప్పినారు. తుదకు ౩ నెలల తర్వాత ఒకనికి ఇన్నూరు రూపాయలకు అమ్మిపోయినారు. అతడును మహాక్రూరుడు. అతనిల్లు చాలాగొప్పది. లోపలి భాగంలో యిద్దరిదాసీల కాపలాయుంచినాడు. ఇట్లా ఒకమాసం జరిగింది. ఒకనాడు ఉదయాన్నే పోలీసువారు "ఖాసిం"ను ఇంకా యిద్దరిని [వారు మొదలు ఖాసింతోవచ్చి నామానభంగం చేసినవారే] వెంటబెట్టుకొని నేను వుండేయింటికివచ్చి యింటి యజమాన్ని పట్టుకొని యిల్లుశోధించి నన్నువిడిపించుకొని పోయినారు.

"తర్వాత ఏమైంది" అని

"తర్వాతకథ యేముంది. కచ్చేరీలో విచారణజరిగింది. అవల్లురికి శిక్షలువేసినారు.

"బాగైంది. కాని నీకీయవస్థయెట్లువచ్చింది. అది చెప్పకపోతివి.

"నన్ను మావారు బహిష్కరించినారు. నేనే ఖాసింవెంటలేచిపోయి చెడిపోయినానని నామీద నిందమోపినారు. నాదేమిన్ని తప్పులేదని ప్రమాణాలుచేసి చెప్పినాను. ఎట్లైన నిన్ను పదిమందిపోయినారు. నీవు పతితురాలవైనావు. ఇంక నీవుమాయింట్లోవుంటె మావంశానికపకీర్తి. మాకపనే తొక్కవద్దు అని అన్నారు. నేనున్నా మొండికెత్తుకొని యింట్లో దాసీపనియైనా చేస్తానని యిల్లువదలకుండా వుండినను. వారు పీడు చెప్పగా చెప్పగా బయట యింతఅన్నం యెత్తివేస్తూవుండేవారు. నాతల్లిదండ్రులకుగూడా దీనంగావ్రాసుకున్నాను. ఎన్నిజాబులువ్రాసినా జవాబులేదు. కొన్నాళ్లకు కాశీకిపోయి ప్రాయశ్చిత్తమన్నా పెట్టుకవస్తాముపద అని నన్ను వెంటబెట్టుకొని వచ్చినారు. మీపొండాయింట్లోనే దిగినారు. రెండుదినాలున్నారు. తామేదో తీర్థానికి పోయివస్తామని చెప్పివెళ్లినారు. మళ్లీరాలేదు. మర్నాడు పొండాయిట్లన్నాడు.— "మీవారు తమదేశానికివెళ్లిపోయినారు. మళ్లీవస్తే చంపివేస్తామన్నారు. ఇకనీయిష్టం."

"నాకు పట్టరానిదుఃఖమువచ్చింది. కాని యేమిచేయగలను? దిక్కులేనిదాన్నైపోతిని. కొన్నాళ్లు పొండా అన్నం వేస్తూవుండినాడు. తుదకు నన్ను నిర్బంధించి నన్ను ఉంపుడుకత్తెగావుంచుకున్నాడు. ఇటీవలనే పోయిన సంవత్సరం ఆముసలిపొండా పెండ్లిచేసుకున్నాడు, నాకీయిల్లు కిరాయకుఏర్పాటుచేసి నన్ను వదలుకున్నాడు. ఇది నాఅపరాధచరిత్రం." అని రాంకుమారి కన్నీరుకార్చింది,

వెంకట్రావు నిశ్చేష్టితుడై యేదో ఆలోచనలో మగ్నుడైపోయినాడు. మరల గంటలు ఒకటీ రెండూ మూడు కొట్టినవి.

"రాంకుమారీ! నీవిషయంలో చాలాఘోరమైనఅన్యాయం జరిగింది. గ్రహచారానికేమిచేస్తావు?........ ఇప్పటికే చాలాప్రొద్దుపోయింది. మళ్లీ రేపుకలుసుకుంటాను:" అని ఆమెనుఓదార్చి కౌగిలించుకొని నెత్తిదువ్వి వీపుతట్టి "ఆయినదైంది. విచారపడవద్దు. మళ్లీ రేపుదర్శనం. సెలవు" అంటూ వెళ్లివచ్చినాడు

———

## సంఘము: యువకుల కర్తవ్యము

[మొదటిపేజి తరువాయి]

నను— నావాడయందు, నాగ్రామమందు, నాజిల్లాయందు, నాదేశమందు అన్నము లేదనివాపోవువాడు లేనట్లు చేసినప్పుడే నేను కృతార్థుడను, పుణ్యాత్ముడననితలతును— అనిప్రతినబూనవలెను.

ఇట్లేమనకెంతకొరతయైన విద్యావిషయమున్న విద్యార్జనము ఒకసంఘమువారి ప్రత్యేకభారమైయుండెను— నారేబ్రాహ్మణులు ఒక్కొక సద్బ్రాహ్మణుడా కాలములోనడచుగ్రంథాలయమువలెనుండెడివాడు— జనసామాన్యము అక్షరాస్యులైనను గాకున్నను హానిలేకుండెను— కానినేడు ప్రజాయత్తపరిపాలనము మనసంఘమునకాదర్శమైన యీదినములలో ఏస్వల్పసంఖ్యాకులలో చదువుకొన్న చాలదు— అశేషజనమువారియను చదువను నేర్పినగాని సంఘమునందు తమతమధర్మముల నిర్వహింపజాలరు.

### కర్తవ్యము

విద్యాసంస్థలు, పాఠశాలలు, గ్రంథాలయములు మనరాష్ట్రమందంతటను నెలకొల్పుట మన యాదర్శము. మనరాష్ట్రమందు గ్రంథాలయోద్యమమున కపారమైనక్షేత్రముగలదు. ఆంధ్ర పఠనమందిరములు కలిసియుండవలెను. మనయాంధ్రభాషకు మనమేతగినంత పరపతికల్గించవలెను. మనవేషములకన్న, మన మతముకన్న, మనల నొక్కతల్లికడుపున పుట్టినబిడ్డలని చూపించగలిగినది మనభాషయే—మనయస్తిత్వమునకే మనజాతీయతకే పునాదియైన మనభాషకు రాష్ట్రమునందర్హస్థానము కల్గించుటముఖ్యపని.

### మనలోపములు

ఈసలహాలు రుచింపకపోవచ్చును— కానిభర్తృహరి చెప్పినట్లు "నహిప్రియంప్రవక్తుమిచ్ఛంతి మృషాహితైషిణః" రుచికరమని, విననింపుగానుండునని, శ్రేయోభిలాషియైనవాడు అసత్యము చెప్పడు— మనయువకులలో ఉద్యమోత్సాహము మెండుగానున్నది— స్వార్థత్యాగబుద్ధికూడయున్నది— కాని కార్యదీక్ష కొరతపడియున్నది— 'ఆరంభించి పరిత్యజింతురు విఘ్నాయత్తులై మధ్యముల్' అను మధ్యతరగతికే రాగలుచున్నారు—గాని ప్రారబ్ధార్థము నుజ్జగింపరుసుమీ అను ఉత్తమశ్రేణికి జేరువరకు యత్నింపవలెను— అదిగాక ఆంధ్రులలోనున్న పారంపరబు బహుళసంఘనిర్మాణాభిలాష—కష్టపడి, చెమటయూడ్చి ధనప్రాణములు కన్నుగాకుండక

నే కీర్తి నిగడింతమను పేరాస మహాద్రోహముని వారలంపు—వాగ్వివాదములకును, నాదకస్థలకును, ఉపన్యాసపీఠములకును నేటినుండి తావులేదు— నేడు కార్యదీక్ష, సహనశక్తి, సుఖత్యాగబుద్ధి, ధనత్యాగబుద్ధికలవారే నాయకులై ముందువచ్చి సంఘమునకుపకరించగలరుగాని ప్రాతమాటలు, అపూర్వయుక్తులను పుడితేసి ఉపన్యాసవేదికపై తారాడజాచువానికి సంఘమునందు స్థానములేదు— మరియొక యంశముకలదు— నాయకత్వమునకై కీర్తిప్రశంసలకై ప్రాకులాడరాదు— ఇదియొక మనోదౌర్బల్యముకాదు సంఘద్రోహము. వ్యక్తికొరకసంఘముగా స్థాపింపబూనినవాడు మనము ముందరుండలేము— ఒక్కొక్కసంస్థకే ఎంతోమంది నిరంతరకార్యకర్తలు గావలసియుండ మనముపుట్టగొడుగులవలె నిర్మించు లెక్కలేనిసంస్థలకు కర్మకారులు ఎచ్చటనుండివత్తురు? మరియు మనసంస్థలకు రుపుడువైనలోపము ధనసహాయము— ధనములేకుండ సంస్థలు కేవలము వ్యక్తులఆదర్శములపై బ్రతుకజాలవు— మనసంస్థల నిర్మించువారివద్దగల మూలధనము ఉత్సాహము— ఒక్కొక్కప్పుడు కీర్తిఅభిలాష, మంత్రములకు చింతకాయలు రాలనట్లు ఆదర్శములచేతను, శిక్షితప్రచారికులచేతను సంస్థలు బ్రతుకజాలవు— ఎడతెగని కార్యదీక్ష, మొండినిరంటితెగింపు, సంతతసేవ వర్షము లేనంతయునిలుచునో అట్టిసంస్థయే కాలప్రవాహములో నిదజాలను— ఆంధ్రుల యందుండు ప్రతిభావిశేషముచే నట్రస్థాయభేదములు మెండు— రవంత యభిప్రాయభేదముగల్గినంతనే మరియొకక్రొత్తజెండా నెలకొల్పబడును— ఇదిదౌర్బల్యమని యువకుల్ ప్రచ్ఛన్న పర్వతముననుసరించుకొనుచు తమనాకల నడిపింతురుగాక— యువకులు నేడు ఒకకార్యము నుండి మరియొకకార్యమునకు కప్పదాటులు వేయరాదు— గ్రంథాలయములు, పాఠశాలలు యువకులకు శిక్షాస్థానములు— ఏతద్విషయకములైనసంస్థలను జయప్రదముగవడిపించుటకుయువకులు నేర్చినవాడు మరి ముందంజవేయుటకు యమాసన్నమగును— తాలింఖానాలుకూడ యువకులసొమ్మే— సిగ్గుపడుట పాలికలకంతశృంగారమో శౌర్యోత్సాహములు గల్గియుండుట యువకులకంతభూషణము— ఇంగ్లండు "ఆటభూములలో" తయారగుచున్నదని చెప్పుదురు—మనరాష్ట్రము మన తాలింఖానాలలో పుట్టిపెరుగగలదు— ఏకార్యక్రమమైనను ఎక్కువదీక్షతో, తక్కువమాటలతో నిర్వహించి యువకులు భావిభారమును వహించుటకు సుశిక్షితులై యుందురని ఆశించుచున్నాను—

———

The best medium for reaching 7 million Andhras, of the State Advertise in Golconda Patrika

# గోలకొండపత్రిక

GOLKONDA PATRIKA

HYDERABAD-DECCAN

The First Telugu Bi-Weekly in Andhra Desa and the leading Telugu Newspaper of H.E.H. The Nizam's Dominions.

Vol. 12. | Mondy 19—7—1937 | No. 21


## పేరు, పైస, ప్రేమ

"ప్రతిష్ఠ" ప్రాసాదానికెళ్లా-
పరిచారికుడాపి--పేరు!
ప్రపంచంలో పేరేవుంటే ప్రార్థనయెందుకు?

— —

లక్ష్మిని దర్శించాలని వెళ్లా
దౌవ్వారికు డడిగాడు--దక్షిణ!
దక్షేవుంటే యీదర్శనాలెందుకు?

— —

ప్రేమదేవతకడకు పరుగెత్తా
సంత్రికి విచారించాడు--సౌందర్యం!
సుందరుడనే యైయుంటే
ప్రేమ భిక్ష మెందుకు?

(ఒక ఆంగ్లకవి)

## సారాయి

ఈరంగు ద్రావకం నిషిద్ధమా?
మరికన్నిరో.........పవిత్రమా?
వినా- నాకు నరకమేలోకి
వెళ్తున్నా-ఇదే చివరనమస్కారం.

— —

కవీ! ఒకమారావేపు నీ
హృదయమూర్తిని చూడూ
ఈపాత్రలో,
ఈయెరుపద్దాల మహల్లో
మేడనుండరు కెంచుచున్న సందేశం
ప్రతిబింబిస్తూంది- చూడు;
ఔను- అది ప్రేమసందేశమే!

— —

ఈ"అమృత" పారవశ్యంలో
కన్నిటికెరటాల కప్పేస్తా
నాతీవ్రితాంతంవరకు అంకకో
రాన్నే చూస్తూ ఆనందిస్తా-
ఆ ప్రేమపాత్ర నింపు
"రక్తస్వప్నా"న్ని చిలికించని-

(వంగకవి)

## భావసౌధం

మంచుమాదిరి స్వచ్ఛమైన గవ్వాకటి
పచ్చికబయిళ్లపై వాల్తూంది-
స్నానంచేయాలని-
బంగారువన్నె రెక్కలు, పాలనుమించిన
తెల్లని మొహం,కమలాలని కలతపరచే
కండ్లున్నాయి-
సువ్యక్తి! యేమాంద్యాపుచ్ఛికలో?
రా, నావద్దకురా- అలాపూరికే వాలిపోకు-

— —

గోపకులు మందలతోల్తున్నారు
లోయలందు కాంతి నాట్యమాడుతూన్నది-
జీవితశేష మంతమొందాయి-

— —

నేనుప్రేమతో చలించలేదనిగా, నీవునన్ను
ప్రేమించజాలవని అంటూన్నావు-
మొదట వికసించిన పుష్పాన్నే
గాలి మొదట కౌవలించుకొని
యెత్తుకెళ్తూంది-

— —

ప్రపంచంలో నివింక మిగిలున్నా నామట్టుకు
పూర్తిపయ్యానని నిశ్చయించుకొన్నపుడు

# కవికుమారుల
# సున్నిత సౌధరాజములు

శోకభారంవల్ల నాహృదయతంత్రులు
తెగి ముక్కలుముక్క- లవుతున్నాయి-

— —

అంధకారం పెరుగుతూంది
అదిఅడవి-ఇది అంధకారం-
పిల్లా! నీవు పడుచుదానవే!
విశావాకు తావొసగికాపాడవు?
భయమేస్తూంది-
ఈరాత్రి; యీచీకట్లో: యీనిశ్శబ్దంలో
నాభావా!లలాశాంతి వహిస్తె యెం
తభావుండేది- హాయిగావుండేవాణ్ణి-

— —

(ఆస్ట్రియాకవి)

## చీనా చిత్రాలు

౧

షాంగియా! నిన్నుప్రేమించా అనుకున్నా
ఏప్రేమ? శాశ్వితంగావుండేది
ఎన్నటికి నాశనంకాంది-
అంతేనా! పర్వతాలు మైదానాలుకానీ
సముద్రాలన్నీ యెండిపోని
చలికాలంలో భయంకరిరించె
పెంపులు మెరవనీ,
ఉరుములు ఉరుమనీ.
మండువేసంగిలో మంచురాల్నీ
కుంభవర్షాలు కుర్వనీ,
భూమ్యాకాశాలు ఒండేకంగాని,
నిన్నుమాత్రం నేను
విడువకుందును-
నీవునేను వొకటైపోవాలి!
[క్రీ పూ ౧౦౦ --ఎవరో]

౨

వర్షం నీజ్యోతిని ఆర్పేయజాలదు
గాలి మరింప ప్రజ్వలింపజేస్తూందీ-
దూరంగా ఆ నీలాకాశాల్లోకి వెళ్లిపో-
చందమామవద్ద నక్షత్రంగా ప్రకాశించు-
క్రీ- ౭౦౫-౭౬ ---లిపో

౩

"మాటకారికి మతియున్న
మతిమంతుడు మౌనం దాలుస్తాడు"
లావో పండితుడు
వచించా డీ సూక్తులు.
"లావో స్వయంగా" జ్ఞానేయనుకొన్న
ఐదువేల శబ్దాల గ్రంథం రచించడ మెందుకు?

—లావో

౪

సముద్రతీరాన
పచ్చపచ్చగా
గరక మొలచింది
తోటలో
పెద్దపెద్దగా, యెత్తుగా,
వెదురుచెట్లు పెరిగాయి,
. క. స్త్రీ బురుజుపైన చిన్న
కిటికీలోంచి
నిరాశగా
కనపడుతూంది.
ఆమె గండుబారిన
బంగారు వన్నెగల మేను
యవ్వనంతో మత్తెక్కింది
ఆసుందర వదనాన్ని
యెర్ర
కిరణాలు ముద్దుకొంటున్నాయి.
ఆమెసన్నని
లావణ్యమైన
చేతులు స్వచ్ఛంగా కన్పడ్తూన్నవి.
ఒకప్పుడామె వద్దకి
నాటకశాల
ఆమెక్రీడా మందిరం.
ఇప్పుడో? దేశదిమ్మరి
యొక్కడికో వెళ్లిపొయ్యాడు మొగాడు
రాత్రిగడుచుటం
ఆమెకు
మిక్కిలి భారంగావుంది.
క్రీ-పూ౧౦౦ ...మీషింగ్

౫

నీవు లేనందున పక్క
వొంటరిగా, నిరాశగా వుంది.
నాకు నిద్రెలా యిక రావటం!
చలి యెక్కువౌతూంది
రాత్రిగాడ్పులు వీస్తూన్నాయి
తెరల్లో ధ్వని పుట్టుతూంది
సముద్రతరంగాలు
వెక్కి-వెక్కి- యేడ్పుల్తో
నావంక పరుగిడ్తూన్న ట్లున్నవి.
ఒకవేళ యివి
నిజంగా తరంగాలై
నన్ను నీవద్దకు
తీసుక్కెళ్లాలని వస్తూన్న
యెంతబావుండును.
క్రీ. ౭౦౦ లేఖ్ [చక్రవర్తి]

౬

ఆద్వారం
శ్వేతోదకంయెదుట తెరువబడుతూంది
కట్టెవారధి కలి సమీపంలో
చక్కని యువతి వొకతె
అక్కడుండేది.
వొంటరిగా— యెవరు
ప్రేమించేవారులేకుండా

చంక్సీ—

౭

చెదిరిపోతూన్న మేఘాలు
డొల్లుతూ వెళ్లిపోతూన్నాయి
విచ్చిపోయిన వానచినుకులు
మెల్లమెల్లగా పుష్పాల్లాగా
రాల్తున్నాయి
అంతా అంధకారం ఔతూవుంది
మైదానమంతా
సముద్రంలాగా మారుతూవుంది
నాదగ్గరో—
సారాయి వుంది
తూర్పుకిటికీలో కూర్చొని
నిశ్శబ్దంగా తాగుతున్నా
స్నేహితుల్ని నిరీక్షిస్తూన్నా
పడవాలేదు—బండీలేదు
క్రీ. ౭౨౩ తావు-చీయన్—

౮

లేతపొచపైని మంచుబిందువు
అతిత్వొందరగా
ఆవిరైపోతూంది
రూపముమార్చిన యీబిందువు
తిరిగి రేపిక్కడ్నే కన్పడుతూంది
భూగర్భంలో మేం పండబెట్టినవారు
యేడ్చినా, శోకించినా
మళ్లీ యెందుకు పైకొచ్చి
మాశోకం మాన్పరో
కన్నీళ్లెందుకు తుడువరో?

౯

నీ దీర్ఘహారావాలు
రాత్రంతా చెవులుపగిలినా విన్నా
నన్నే నీ వనుక్షణం
జ్ఞాపకం చేస్తున్నావని
నన్నే జపంచేస్తున్నావని
గ్రహించా
ఈశబ్దోచ్చారంతో
వైకుంఠద్వారాలు తెరువబడ్డాయి
మాయిద్దరి ఆత్మ లొకటయ్యాయి.
వొరికల్లో వొకర్ం లీనమయ్యాం
ప్రేమకిరణాల చిమ్ముతున్న
ముద్దుమోహాన్ని రెప్పవాల్చక చూశా
ఆ సుకుమార మైన తొడను
తలగడగాజేసి
మైమరచి
ప్రేమపాత్రయందలి
అమర మాధుర్యాన్ని
పానంచేశా-
ఆమె తలవాల్చిన చెక్కిరికళ్ళు
వుల్కిపడ్డా నిల్చా
ఆమెఅక్కడ కన్పడ్లా
నాహృదయ మప్పుడెలా
ముక్కలైంది యెవరికీ తెలియదు
నాకన్నీటితో వక్షస్థల
మెలా పొర్లిపొరిందో—?

—పావుచావు

౯

వుత్తరాలు రాసి
స్నేహితుల్ని పిడుతక
పిల్చా
అంతా వచ్చేశారు
కంఠాలు పగిలేట్టర్చారు
చక్కగా వాదించుకొన్నారు
సామాన్యాహారంతోనే
వేదాంతం విడదీసారు
రహస్యాలు రచ్చకీడ్చారు
సమ్మతించారు
వొకటయ్యారు
వుత్సాహ సముద్రంలో
తుఫానురేగింది
హృదయాలు తృప్తిపడి
శాంతివహించాయి
క్రీ ౭౩౩ —బెంగ్ మాంగ్ సోయి


Printed and Published by G. Ramakrishna Reddy at the Golkonda PowerPress Hyderabad. Editor K: Balakrishna Reddy

# సంస్థానాధిపతుల నిరంకుశ పాలనము

సంస్థానములందు జరుగుచున్న అత్యాచారములు, అక్రమములు ఘోరములు

అన్నపానాదులులేక అల్లాడుప్రజల హాహాకారాలు బధిరశంఖారావములా?

ప్రజాక్షేమకార్యములు "హానికరములు"

విచారసంఘమువారికి విషయములువిశదపరచుట ముక్తిదాయకము

(మా బందరు విలేఖరి)



అఖిలభారత సంస్థానప్రజలమహాసభాధ్యక్షులగు శ్రీభోగరాజు పట్టాభిసీతారామయ్యగారు ఒరిస్సారాష్ట్రసంస్థానప్రజల మహాసభానంతరమిట్లు ప్రకటన గావించిరి:-

ఒరిస్సాప్రాంతమందలి సంస్థానానుభవములను, యితరప్రాంతములందలి సంస్థానములనుండి రోజురోజునాకు చేరుచున్నవార్తలవలన తిరిగిఅన్ని సంస్థానములలో నిర్బంధవిధానమారంభమైనట్లు స్పష్టపడుచున్నది. ఇతరసంస్థానములందు మాదిరీయొరిస్సాప్రాంతపు సంస్థానములందత్యాచారములు ప్రబలుచున్నవి. సంస్థానములందు జరుగుచున్న అత్యాచారములలో సంస్థానాధిపతుల ఆజ్ఞల నిర్వహించని యుద్యోగుల హింసించుట, స్త్రీలపై దౌర్జన్యము జరుపుట, సంస్థానాధిపతుల విలాసపరవశత్వము మొదలగునవి-వెట్టిచాకిరి, కూలినిర్బంధము, ఆడపుల్ల ప్రతిబంధకము, వివాహదార్థము జరుపబడుచుండుహింసలు, స్థానాపహారము, నజరానాలు మొదలగునవి ముఖ్యముగా పరిగణింపబడుటలేవు. ఉచ్చారణలకలవిగాని యత్యాచారములు జరుగుచున్నట్లు తెలుపబడుచున్నవి. వీనివిచారణకై అఖిలభారత సంస్థానప్రజల మహాసభ కార్యదర్శియగు శ్రీబలవంతరాయమెహతా, బాబుసతీశ్చంద్రబోసు, ప్రజసుందరు లాల్జి సభ్యులుగల కమిటీయొకటి నిర్ణయింపబడినది. రాజకీయములతో దీనికెట్టి సంబంధము లేనందున సంస్థానప్రజలు తమకష్టనిష్ఠురములు వీరికి విశదపరచిన తగుసాక్ష్యములగైకొని మహాసభవారికి రిపోర్టుచేయుదురు. మధ్యదేశము, రాజపుత్రస్థానమందలి సంస్థానములనుండి చేరుచున్నవార్తలు ఘోరములు. యోధపురవిషయము దిలకించుడు:-

గడచిన మూడుసంవత్సరములనుండి యీసంస్థానమందలికొన్ని జిల్లాలలో ఘోరమైన కాటకము ప్రబలియుండెను. ప్రభుత్వమువారు రైతుల పోషణార్థమేచర్యయు గైకొననందున పరిస్థితులు విచారించుటకు మేమొక వ్యవసాయిక విచారణసంఘము నియమించి కాటక ప్రదేశములకు బంపితిమి. పశువులకు దిను మేతలేక సగముకన్న నెక్కువ మృత్యువాతబడెను. రైతు లమితముగా బాధపడుచుండిరి. ప్రభుత్వముగాని, ధనికులుగాని లేక ఉదారపురుషులుగాని వీరివిముక్తికై పచ్చిక సప్లయిచేయుట, భావులు త్రవ్వించు టత్యవసరమని మా యభిప్రాయము. బలోత్రనుండి పాచబద్ర-౭మైళ్లదూరముకు బండ్లపైదేబడిన నీరు మూడణాలకు బిందెడునీరమ్మబడుటఘోరము. నీటికరవువిపరీతముగా గలదు. ఈవిషయములన్నియు పత్రికలలో ప్రకటించిన మమ్ము శిక్షించెదమని ప్రభుత్వము భయపెట్టినది. ప్రధానమంత్రి యగు కల్నల్ డి.యం. ఫీల్డుగారి స్థానమున పనిచేయు నధికారి పోలీసు ద్వారా మాకిట్లు నెరింగించెను:—

"ప్రజామండలి, సివిలులిబర్టీసు సంఘములకు చెందినవారెవ్వరూ ప్రజలయందసంతృప్తి వ్యాపింపజేయు నుద్దేశముతో జిల్లాలలో ప్రవేశింపవీలులేదని అచలేశ్వరప్రసాదుగారికి వెంటనే తెలుపవలయును. వారు,వారియనుచరులు సలుపుచున్నట్టి హానికరమగుపనులను ప్రభుత్వము దిలకించుచునేయున్నది. ముందికవీరు తమ కార్యములవిరమించుకొనకున్న కఠినమగుచర్య వీరలపైగైకొనబడునని తెలుపుడు." ఇదిప్రధానమంత్రిగారు పోలీసుకంపిన త్రిముఖము-

౧౯-౫-౩౭సం॥న అ.భా.సం-ప్రి- కరాచిసమావేశానంతరము నేనుయోధపురమేగి రెండు రోజులు బహిరంగసభలలో నుపన్యసించితిని- కొందరిపైజారీచేయబడిన నోటీసులను--సివిలులిబర్టీస్ యూనియను జరుపుచున్న "హానికరము"లగు [ఇదేపదము తిరిగిప్పుడు వాడబడినది] కార్యములందు పాల్గొనరాదు--చూచితిని-వీనిపై పోలీసుయినస్పెక్టరు సంతకమున్నది- ప్రధానమంత్రిగారి యాజ్ఞపైయిది జారీ చేయబడినట్లు దానిపైనున్నది- కాని సివిల్ లిబర్టీస్ యూనియనుయొక్కచర్యలు నిషేధములని తెలుపబడలేదు. సంస్థానముగోచరమని ప్రధానమంత్రిగారు పత్రికలద్వారా దెలియపరచుట విచిత్రము!

నిషేధమెంతనిజమో పరీక్షించుటకై మర్నాడు సివిల్ లిబర్టీస్ యూనియనుపక్షమున బహిరంగసభ ప్రకటించితిని- కాని యెట్టియాటంకములు కలుగకున్నను ప్రజాహితకార్యములు సలుపుచుండిన సంస్థానమందలి ముగ్గురుప్రముఖులను, యెట్టివిచారణ జరుపకయే, కఠినశిక్షలకు గురిగావించిరి-

ప్రస్తుతస్థితియందు యీసంస్థానములో ప్రజాసేవకులచే జరుపబడుచున్న యార్థికవిచారణ నిరాటంకముగా జరుగగలదనుట సంశయాస్పదము- సంస్థానములందు నిరంకుశపరిపాలనము వృద్ధియగుచున్నది- రామరాజ్యమనదగిన మైసూరులో బహిరంగసభలకు ఆజ్ఞబడయుట విచిత్రము- పాటియాల ప్రభుత్వచర్యలు విమర్శించుటచే పంజాబునుండి భగవాన్‌సింగు లాంగ్వాలాగారు తరిమివేయబడిరి- సంస్థానాధిపతులు ప్రజలకోరికల నణచివేసి నిరంకుశముగా పాలించుచున్నారనుట కివియే ప్రబలనిదర్శనములు-

## మరట్వాడా వార్తలు

### ఔసా

(అ. న్యూ. స,) ౩-౧౦-౪౬

ఉస్మానాబాదజిల్లామందలి యీగ్రామములో ౧౪ అమర్దాదుకోనా హిందూ మహమ్మదీయుల పోరాటము జరిగినది. హిందువులు ఊరేగింపులో మసీదుయెదుట వాయిద్యములు వాయించుటయే పోట్లాటకారణమని తెలుపబడుచున్నది. దీనివలన అనేకులు గాయపడిరి. పోలీసువారు విచారించుచున్నారు.

---

### భైంసా

[ఒక విలేఖరి]

కాలమానము

౩-౧౦౪౬.

నాందేడుజిల్లాలోనిది యీగ్రామము, వర్తకస్థలము, వర్షకాలమారంభమునుండి ఇంతవరకు నైర్యుతి కోస్యమగు వర్షములు కురువనందున భూమియందు విత్తబడలేదు. రెండుమూడు రోజులనుండి ముసురు కురియుచుండుటచే రైతులందరు తీరుబాటులేక పత్తి విత్తనములు, విత్తుచున్నారు.

క్రొత్తధికారి

ఇదివరకుండిన మున్సిపుగారు మార్చబడుటచే వారికి వీడ్కోలు విందులు జరుగబడుచున్నవి. వరంగలు మున్సిపుగారు ఇక్కడికిమార్చబడినటుల తెలియుచున్నది.

ప్రజల భయము

వర్షము సరిగాకురియనందున పశువులకు మేత లభింపకుండు పోవునని ప్రజలు భయపడుచున్నారు.

---

### జాల్నా

(ఒక విలేఖరి)

౨-౧౦-౪౬.

ఇద్దరు సాహుకారుల నిర్బంధము

ఇచ్చటిపోలీసువారు ఇద్దరుసాహుకారులను దొంగనాణ్యముల చలామణీనేరముక్రిందనిర్బంధించిరి. వీరిలోనొకరు స్థానికులు, మరొకరు బ్రిటిషుప్రాంతమందలి అత్యంత సంపన్నుడగు మార్వాడీ. స్థానికునివద్ద దొంగనాణ్యము మార్చుచున్న సమయముననే చివరవానిని పోలీసు నిర్బంధించినది. స్థానికునివద్ద కొన్ని దొంగనాణ్యములు చిక్కినవి. న్యాయస్థానమునందు చాలాన్ చేయబడినది. ప్రస్తుతము వీరిద్దరు జమానతుపై విడుదల చేయబడిరి.

౧౩వేల ఆభరణముల దొంగతనము

రైల్వేస్టేషనువద్ద దొంగలు పట్టుబడుట

జాల్నా రైల్వేస్టేషన్ సమీపమందలి కరోడీకివరణమునందు ఇద్దరుఅరబులు ౧౩వేలవిలువగలఆభరణము లపహరించిరనునేరముక్రింద నిర్బంధింపబడిరి, ఈవర్గమునం దెవరండుగురు గలరనితెలిసినది. మిగతవారినింకింతవరకు తెలియలేదు. చాలాకాలమునుండి పోలీసువారల వెంటాడుచున్నది. స్థానికరక్షకశాఖవారి సాయమున వీరిద్దరు మాత్రము పట్టుబడిరి.

---



### ఉస్మానాబాద

[ఒక విలేఖరి]

తుఫానువర్షము

వేలకొలది నష్టము

౧-౧౦-౪౬.

మొన్నటిరాత్రి సుమారు రెండుగంటలకు మురుగుపాన మొదలై తుపానురూపము ధరించెను. నగరమందలి నదీ పరిపూర్ణమై మహాసాగరముగా మారెను. నీరు, నది హెచ్చుగుటచే వారధి భాగమొకింత కూలిపోయినది, ప్రవాహమువలన అనేకవృక్షములు కొట్టుకపోవుటయే గాక రోడ్లన్నియు కయ్యలుగోసినవి. నడచుటకు వీలులేకుండునట్లుగలదు. నగరమంతయు సాగరమందలి నావవలెమారినది. నీటికాలువలవారి సరోవరములు, ఇంజన్ మొదలగునవి పర్యాప్తశనమైనవి. దీనివలన కొన్నివేలనష్టమువాటిల్లినది. మొత్తముపై అరకోటి రూపాయిలనష్టము కురిసినదనవచ్చును.

---

### మోగాంవ్

౧౩గురు కాటు

౩-౧౦-౪౬.

ఉస్మానాబాదుజిల్లాలోని బోరి జాగీరుసంబంధపు మోగాంవ్ గ్రామమునందు పెండ్లిసందర్భమున అకాగ్రతగా బానసంచ కాల్చుటచే ౧౩ కాలిరి. వీరిలో యనేకులస్థితి మిగుల అపాయకరముగాగలదు.

---



---